శ్రీ ర స్తు.

శ్రీకృష్ణార్జునసంవాదం బనునామాంతరముగల

# గయోపాఖ్యానము

రామనామాత్యప్రణీతము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1934.

శ్రీః

# ధన్యవాదము.

---

మహాశయులారా!

సృష్టివైచిత్ర్యమనూహ్యము. దానివిధ మిట్టిదని తెలుపఁజాలువార లుందురా యన్న శంక నొందవలసినదే. ఆమహాప్రకృతి తప్పఁ దక్కొరులు తెలిసికొనఁజాలరనుట కావంతయు సందియములుండవు. ఒక్కొక్క కాలమున నొక్కొక్క భాగము వృద్ధినొందును. వేఱొక్క భాగము క్షీణించును. అన్నిభాగములు సమానస్థితినుండుట ప్రపంచమునం దేకాల మందును లేదని కొందఱు మహనీయులు పలుకుదురు. అది యంగీకరింపవలసినదే యనఁదగియున్నది. అరిషడ్వర్గముల త్రిప్పులకు లోనుగానివారలెల్లతావుల నిండియుండుట సంభవించునేని భూఖండములెల్ల సమానమర్యాద గలిగి యుండనోపు. అట్లుగానిచో సుఖదుఃఖములకు నాలవాలములు కాకతప్పదు.

ఒక్కకాలమున నొక్కవిషయమున మానవులలో నుత్సాహము చెలరేఁగును. ఆవిషయమున కాకాలము వృద్ధిప్రదాయకమగును. కొంతకాలమున కావిషయమున నుత్సాహము తగ్గును. దాని కవ్వల వృద్ధిలేదని యూహింపవచ్చును. కాని సృష్టియం దేదియు నశింపదు. కొంతకాలము గడువఁగా మరల నయ్యది పొడసూపుటయుఁ గలదు. దాని కది యభివృద్ధికాలమనియు మనమూహింపవలయును. ఇట్లే సర్వవిషయములయందు వృద్ధిక్షయములు కలుగుచుండును.

లోకము నుద్ధరింపనవతరించినవా రవతారపురుషులను ఖ్యాతిఁగాంతురు. వారియందు భగవదంశ మధికముగా నుండునని పెద్దలందురు. ఏ కార్యమును సాధింప వారి నాపరాత్పరుఁడు ప్రోత్సహించునో తత్కార్య

క్షేమమగు స్వాంశము నావేశింపఁజేయుననుట విచిత్రముకాదుకదా. "ఏవేష మున కాభాష, ఏగాలి కాచాప" అను లోకోక్తి ప్రసిద్ధమేకదా. ఆయవ తారపురుషు లాకార్యమును నిర్వహించు శ్రద్ధకల వారలై పోల్తురు. ఎల్లరు వారి ప్రయత్నమును శ్లాఘింతురు. తోడుపాటుగూడఁ జూపుదురు. భగవ దంశ మెల్లర నంగీకరింపఁజేయఁజాలు ననుట నిర్వివాదాంశము. ఆట్టివా రొనరించు కార్యములన్నియు జ్ఞానాభివృద్ధిని జేయునవియై యుండును. దుష్టుల వధించుటయుఁ శిష్టులఁ బాలించుటయు లోకులకు జ్ఞానాభివృద్ధికొఱకే యని యూహింపఁగాఁ దుదకుఁ దేలును. ధర్మము జ్ఞానసాధకమే యని యెల్ల రంగీకరింతురు. నదులన్నియు సాగరమునఁ గలియునట్లు సత్కార్యఫలము లన్నియుఁ జ్ఞానసాగరమునఁ జేరును. అట్టిజ్ఞానమే భగవంతునికడకుఁ జేర్చును. అనఁగాఁ దత్త్వము నెఱుఁగఁజేయును.

విక్రమార్కుఁడు భోజుఁడు లోనగువా రట్టి యవతారపురుషులలో నంతర్భూతులే యగుదురు. విద్యాభివృద్ధి కొఱఁతవడియుండుటంజేసి వారా కొఱంతందీర్ప బద్ధకంకణులై రేయింబవళ్లు పాటుపడి యకార్యమును సాధించి యశశ్శరీరమును శాశ్వతముగా భూలోకమున నిలిపి భగవంతుని యం దైక్యమైరి. జ్యోతిశ్శాస్త్రము విక్రమార్కునికాలమునందును, సంస్కృతకవిత్వము భోజరాజుకాలమునందును వృద్ధినొందెను. వారిపనినే తరువాతివారు కొందఱు మహాత్ములు నిర్వహించిరి. సంస్కృతకవిత్వము కోటి కెక్కఁగా నట్టిమహాత్ములు దివంగతులైరి. కాని వారియశఃకాయములు స్థిర ములై యలరారుచున్నవి.

శ్రీకృష్ణదేవరాయలు వారిపిదప నట్టికార్యమునందే శ్రద్ధగలిగి తన యపారకార్యములలో నది ప్రధానమని సంభావించి మహాత్ముల సేకరించి యచిరకాలమున నావ్రతమునకు నుద్యాపనముచేసి స్వర్గమునకరిగె. అంతకుం బూర్వమున్న రాజులెల్లరు యథాశక్తి న్యాయమున నాకార్యమును నిర్వహిం చినవారే. కాని "పుణ్యైర్యశో లభ్యతే" అన్నట్లు లాంధ్రభోజుఁడను విఖ్యాతి శ్రీకృష్ణదేవరాయలకే కలిగెనని చెప్పవచ్చును. వారివెనుక నంతటివారు లేరనవచ్చును. కాని "చెఱుపుపట్టుచెలిమ" యన్నట్లు మహాత్ములు భూపాలు రప్పనిని సాగించిరనియు, సాగించుచున్నారనియు, సాగింపఁగలరనియుఁ జెప్ప

వచ్చును. శ్రీకృష్ణదేవరాయల తరువాత భగవంతునితలంపు పురికొలుపఁగాఁ గవులే భాషను బోషింపఁబూని యక్కార్యమును నిర్వహించిరనవలయును. కొంతకాల మప్పనిసాగఁగా నించుకయంతరాయము పొడమి దానినిదగ్గించె ననవలయును. ధనాశపొడమి వారినుత్సాహవంతులఁగాఁ జేయకనిరుత్సాహులనుగా నొనరించెనని యొఁ గొంద ఱందురు. సత్యమే యనవలయునేమో.

ప్రకృతవిషయమునఁ బేర్కొనఁదగినవారు మ-రా-రా-శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారుగ నున్నారు. వారియందుఁ బ్రాచీనగ్రంథప్రకటన మహాకార్యపరత్వము ప్రధానము. ఎన్నివందలయేండ్లనుండియో తాళపత్త్రములతోఁ బేటికాంతర్భూతములై కీటకచ్ఛటాగ్రస్తములై రూపఱనుండు సంస్కృతాంధ్రగ్రంథసముదాయమును బ్రకటింపనెంచి యదియే పరమపురుషార్థముగా భావించి తత్సంస్కారార్థము పండితులఁ బ్రార్థించి ధనమొసంగియు వారిగ్రంథములఁ బ్రకటించియు మఱియు నెన్నియేమార్గములవారికిఁ దోడ్పడుచు వారిమూలమున సరిచేయించి చక్కఁగ ముద్రించుచు లోకమునకు మహోపకారముగానించు వారు వేంకటేశ్వరశాస్త్రులుగారు. ఈవిషయమాంధ్రలోకమునకు మాత్రమే కాక ద్రావిడాదిదేశవాసులకుంగూడఁ గ్రొత్తది గాదు. ఇంతవఱకు నింతటి మహాకార్య మెవ్వరైనఁ జేసినారా యని ప్రశ్నించినచో లేదనియే బదులువచ్చును గాని చేసిరని యదిరాదు. ఉపనిషత్తులు, స్మృతులు, వైద్యాదిశాస్త్రములు, దురవబోధములుగ నుండఁ దేటఁగఁ దెలుఁగుటీకలు వ్రాయించి ప్రకటించిరి. ప్రబంధములను వందలకుమించి ప్రకటించిరి. ఎన్నింటినో ప్రకటింపనెంచియున్నారు. ఆశ్రయించినవారికి ధనరూపమున సాయపడుట యటుండఁగా వారిగ్రంథములను బ్రకటించి యవి విక్రయింపఁబడునా యని సంశయింపక కార్యము సాగించుచున్నారు. ఏతద్విషయమున వీరు సన్మానార్హులలో నగ్రగణ్యులనుట కేశంకలుండవు. వావిళ్లవారి యీప్రయత్నమే లేనిచో నీగ్రంథములలో శతాంశము కూడ బయలు వెడలియుండవు. ఆంధ్రమహాజను లీవిషయమున వావిళ్లవారి కప్పుపడియున్నవారు. చంద్రునకు నూరుపోఁగన్నసామెత ననుసరించి మహాజనులు కృతజ్ఞతఁ జూపఁదగియున్నారు.

ప్రకృతవిషయమును బరిశీలింతము. గయోపాఖ్యానము రెండాశ్వాసములుగల గ్రంథము. శ్రీకృష్ణార్జునసంవాదమను నామాంతరము దీనికిం గలదు. ఈయది ముద్రింపఁబడి ప్రచారములో నున్నదియే. కాని యా ముద్రితగ్రంథము చదువ శక్యమే కాదు. ఆవిషయమును బిదప పరిశీలింతము. దీని యాశ్వాసాంత్యగద్యమున "ఇది శ్రీమదహోబళేశ్వరకరుణాకటాక్ష వీక్షణప్రవర్ధమానవైభవ తిమ్మనమంత్రితనూభవ రామనామాత్యప్రణీతం బైన శ్రీకృష్ణార్జునసంవాదం బనునామాంతరమ్ముగల గయోపాఖ్యానం బను మహాప్రబంధమ్మునందు" అనియున్నది. మొదట నిష్టదేవతాస్తుతులు ప్రాచీన కవిస్తుతి మొదలగు ప్రాచీనాచారనిర్వహణపద్ధతులులేవు. కావునఁ గవిని గూర్చి తెలిసికొనఁదరముకాదు. ఏకాలపువాఁడు? ఏదేశమువాఁడు? అనియుఁ గనుఁగొను నవకాశములేదు.

క. శ్రీగంగాధరసన్నుత, సాగరహృదయాబ్జసదన సారసనయనా
నాగేంద్ర వరద శుభకర, నాగకులాధీశతల్ప నరమృగరూపా.

అనుపద్యముతో గ్రంథ మారంభింపఁబడినది. వ్రాతప్రతులు మూఁడును ముద్రితమైన దొక్కప్రతియు నాకడఁజేరినవి. అన్నియు నొక్కరూపము ననే యున్నవి. చాలపద్యములు పాదాంతరము వేఱొకవృత్తలక్షణము గనుండునవియే. మూఁడుపాదములుగలవియుఁ గలవు. పంచపాదికందములు గలవు. దీనిస్థితి యతివిచిత్రము. "కలిపికొట్టురా కస్తురిరంగా" అన్నట్లు నాలుగుప్రతులను గలిపి యీగ్రంథమును విమర్శించితిని. ఇప్పటి యీ రూపము నలవరించితిని. ఇది నిర్దుష్టమని నమ్మరాదనుట నేను జెప్ప నక్కఱ లేదు. ముందుముం దట్టిదికావచ్చును.

అహోబళేశ్వరభక్తుఁ డీకవి యని మన మెఱుంగవచ్చును. నృసింహ కరుణాపాత్రుఁడ ననక "యహోబళేశ్వరకరుణా...వైభవ"అనియున్నందున నీరామనామాత్యుఁడు కందనూలు (కర్నూలు) మండలమున నాయహోబళక్షేత్రమునకుఁ జెంతనుండువాఁడని యూహింపవచ్చును. కాని యదియే సిద్ధాంతము కాఁజాలదు. కవిజీవితము మూఁడవభాగమున శ్రీవీరేశలింగము పంతులుగారు విశేషించి వ్రాయనవకాశము లేమింజేసి

"ఈతఁడు నూఱుసంవత్సరముల క్రిందటివాఁడయియుండవచ్చును. ఇతఁడు తన గ్రంథమును శ్రీమదహోబిలనృసింహస్వామి కంకితముచేసెను. ఈతని గ్రంథమునందు లక్షణవిరుద్ధములైన ప్రయోగము లనేకములున్నను మొత్తము మీఁద కవిత్వము సరసముగానే యున్నది." అని వ్రాసి రెండుపద్యము లుదాహరించిరి. అందు మొదటిపద్యము రెండవపాదమునఁ దొలియక్షర ద్వయములేదు. వారికింగూడ నిట్టి ప్రతియే దొరకియుండుననితోఁచెడిని. అమాత్యశబ్దమును జేర్చినందున నియోగి బ్రాహ్మణుఁ డని తేలును. ఆఱు వేలవారని నిర్ధారణము చేయ వలనుపడదు. రాయలసీమలో నియోగు లనఁ బడువారిలో నందవరీకులు ప్రథమశాఖలు, ఆఱువేలవారు, కన్నడీలు, ఊలస కమ్మలు మొదలగువా రందఱు చేరుదురు. ఇంటిపే రుచ్చరింపనందున నిం దెవ్వరైనది నిశ్చయింప వలనుపడదు. నూఱుసంవత్సరముల క్రిందట నున్నవాఁ డనియుఁ జెప్ప నవకాశము చాలదు. పూర్వకవిస్తుతిపద్యములైన నున్న యెడల నించుమించుగా నీశతాబ్దియం దుండవచ్చునని యూహింపవచ్చును.

గయోపాఖ్యానము కల్పితకథగలది. ఇట్టి వనేకప్రబంధములుంగలవు. ఈకల్పనయం దెన్నిలోపములున్నను శ్రీకృష్ణమూర్తి భక్తపరతంత్రుఁ డనియు, నర్జునుఁడు పలికినమాటను జరపువాఁడనియుఁ దేలును. నారదుఁడు లేనికలహములే లేవుకదా. శౌనకాదిమహామునీంద్రులకు సూతుఁడు చెప్పుటయు నట్టిదే. ఆసూతునకు స్వోక్తివ్యాఘాతాదిదోషములండవనియు మన మొప్పుకొనవలసినదే. దుర్యోధనాదులు పాండవులపక్షమునఁ జేరినట్లు కల్పించుట లోకమున నెల్లరు స్వార్థపరులే యను నీతినిబోధించును. ఈయుద్ధము నందు బలరాముఁడు శ్రీకృష్ణుఁడు వారిసేనలు పరాజయముచెందిరనియే కనఁబడును. ఇది యొకలోపమనవచ్చును. అర్జునునికడనున్న గయుని భగవంతుఁడు దివ్యదృష్టిం గనుఁగొనియెనని చెప్పుటంజేసి శ్రీకృష్ణునకు మర్యాద దక్కెననియే మనమూహింపవచ్చును. ఏదియెట్లున్నను బామరులకు నీగ్రంథము వినోదమును గల్గింపక మానదని మన మంగీకరింపవలయును. సంస్కరించి పద్ధతులను గూర్చి వ్రాయక యొక్క యుదాహరణము చూపుచున్నాను. "బజభీష్మనిచ్ఛాయ బరగువాహనవాని, పూర్ణచంద్రనిబోలు ముఖమువాని" అను సీసపాదము వ్రాఁతయందును, ముద్రణమునందుఁ గలదు. దానిని

‘‘వజ్రవరచ్ఛాయఁబరఁగుదేహమువానిఁ, బూర్ణచంద్రునిబోలుముఖమువాని.’’
అని మార్చి యిపుడు ముద్రింపఁబడినది.
‘‘వేల్పేశుఁడితఁడైనవేయిగన్నులులేవు,హరిహయుండును గాఁడునరుఁడుగాని’’
అను సీసపాదము

‘‘విబుధేశుఁ డితఁడైన’’ అని మార్పఁబడినది.

వీనినిమించినవి వేనవేలుగలవు. విశేషించి పెంచి వ్రాయనేల యని విరమించితిని. తాటియాకులప్రతి యెందైన దొరకునేమో యని యాశించుచున్నాను. దొరకిన దానియందలి యొప్పులను జేర్చి ముద్రింపవలయునని వాంఛించుచున్నాఁడను. ఇంతమాత్రమైన నియ్యది చక్కఁబడునా యనునూహ చేఁదోఁచినట్లు సంస్కరించితిని. వ్రాఁతప్రతులున్నచో మహాశయులు నాకుఁ బంపించిన శిరసావహించి మరల ముద్రించి వారివి వారికిఁబంపుచు నచ్చుపడినది కూడఁ బంపెదను. ఈవ్రాఁతప్రతులుగూడ శ్రీ వేంకటేశ్వరశాస్త్రులు గారు సేకరించి నాకడకుఁజేర్చినవే.

రామనామాత్యుని కవిత్వము చక్కనిదే. వ్రాయసగాండ్ర యనుగ్రహాతిశయమునకుఁ బాత్రము కాఁగా నిట్టిరీతిగాఁ దేలినది. పుస్తకమే యున్నందున నిందలిపద్యము లుదాహరింపక వదలితిని. ఇందు నాచేసిన ఘనకార్యమేదియు లేదు. ఇట్టిగ్రంథములను బాగుచేయఁబూనిన శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారి తలంపే సత్యము. ఎన్నియో గ్రంథములకు వ్యాఖ్యలు వ్రాయించి ముద్రించి భాషోద్ధారకులైరి. ఇట్టిమహోపకారపరాయణులగు శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారి పుత్త్రరత్నములగు శ్రీ వేంకటేశ్వర శాస్త్రులుగారికి శ్రీ పరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించుఁగాక. ఆంధ్రగ్రంథముల నింకను వెలయించి యింకను యశంబుగాంతురుగాక!

ఇట్లు విన్నవించు విద్వద్విధేయుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.
శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ ర స్తు.

# గ యో పా ఖ్యా న ము

## ప్ర థ మా శ్వా స ము.



గంగాధరసన్నుత
సాగరహృదయాబ్జసదన సారసనయనా
నాగేంద్రవరద శుభకర
నాగకులాధీశతల్ప నరమృగరూపా! 1

వ. అవధరింపుము శౌనకాదిమహామునీంద్రులకు సూతుం డిట్లనియె. 2

క. సరసీజాప్తోదయమున
సురరిపుమదహరుఁడు లేచి సొంపలరంగాఁ
దరుణీమణి రుక్మిణితో
స్మరకేళీగృహము వెడలి మలయుచు నిలువన్. 3

క. పచ్చనిగిండియ యుదకం
బచ్చేడియ వేగ తెచ్చి యతిమోదముతోఁ
బచ్చవిలుకానిగురుఁ డగు
సచ్చరితునికాళ్లు గడిగె సంరంభమునన్. 4

తే. కలికి యొక్కతె పన్నీరు గౌరవమునఁ
దెచ్చియిచ్చినఁ గైకొని దివిజనుతుఁడు
ధౌతవస్త్రప్రసన్నుఁడై తనరుచుండెఁ
గోటిభాస్కరతేజుఁడై కొమరు మిగుల. 5

సీ. పూర్ణచంద్రునిఁబోలు ముఖముపై మృగనాభి
తిలకంబుఁ దీర్చెను గలికి యొకతె
కంబుసమానమౌ గళమున భాసురా
భరణంబు లొకసతి [1]సరగ నునిచె
నీలమేఘచ్ఛాయ నిరసించునెమ్మేనఁ
జందనం బొకలేమ చక్కనలఁదె
శ్రీకారముల మించు చెలువైన వీనులఁ
గాంత యొక్కతియ చౌకట్లు పెట్టె

తే. శిఖను బువ్వులసరు లొక సకియ చుట్టెఁ
జంద్రకావిరుమా లొకచాన గట్టె
వ్రేళ్ల రత్నోర్మికల నొకవెలఁది చేర్చె
నందనందనునకు మహానందమునను. 6

తే. పండుటాకుల కపురంపుబాగములును
జొక్కమౌనట్టి మౌక్తికచూర్ణ మమరఁ
గూర్చి మడుపులఁ బూఁబోఁడి గోపభామి
నీమణి యతని కిడియె బల్ నేర్పుతోడ. 7

వ. మఱియును సకలభూషణాలంకృతుండును, గంధకస్తూరి
కాసారనానావిధమణిహారోజ్జ్వలగ్రీవుండును, బీతాంబ

1 పదిల పఱచె ; పరఁగఁ దాల్చె.

రాలంకృతుండును, గనకరత్న ఖచితకుండలోద్భాసితగండ స్థలుండును, మృగమదశోభితముఖారవిందుండు నుద్యా నవనగమనోత్సుకుండు నయి మణిమయసింహాసనంబు డిగ్గి భోజకన్యక, సాత్రాజితీమిత్రవిందాదిభామామణులు సకల భూషణాలంకృతలయి యుభయపార్శ్వముల నడువ నగ ధరుండు ముక్తాతపత్రంబులనీడ నగరువెడలి విచ్చేసె నపుడు. 8

సీ. మంత్రులు హితులు సామంతులు పౌరులు
సేనాధినాథులు చేరి కొలువ
నాప్తులు సఖులు న ట్లవనీసురేజ్యులు
విశ్వంభరాధిపుల్ వెంట నడువ
నీతిశాస్త్రజ్ఞులు నిగమాంతవేదులు
పౌరాణికశ్రేణి ప్రబలి రాఁగ
ఘనులు పురోహితుల్ గాయకుల్ నర్తకుల్
వారాంగనామణుల్ [1]వరుసఁగొలువ

తే. గంధసింధురసైంధవగణములలర
రమ్యమైనట్టి కాంచనరథముమీఁద
నీటుమీఱంగ యాదవుల్ నెమ్మిఁ గొలువఁ
జక్రి సకియలతో నెక్కె సౌరు గులుక. 9

క. యోగోద్ధారక దానవ
నాగమృగాధిప మురారి నారదవినుతా
భోగీంద్రతల్ప శయనా
సాగరప్రియ యనుచు మధురసన్నుతి చెలఁగెన్. 10

---

1 బలసిగొలువ.

తే. చారుమురజాదికాహాళశంఖవేణు
వీణలుఁ భేరికాధ్వనుల్ వివిధగతుల
దిశల బోరని మ్రోయంగ దివిజనుతుఁడు
[1]వరుస ద్వారక వెడలెను వనముఁ జూడ. 11

సీ. పాంచాల గాంధార బర్బరేంద్రులు వీరె
లలితసువర్ణకుండల పరాకు
మాలవ నేపాల మత్స్యాధిపులు వీరె
యబ్ధిసుతామనోహర పరాకు
కొంకణ టెంకణ కోసలేంద్రులు వీరె
చంద్రభాస్కరవిలోచన పరాకు
కాశ్మీర కాంభోజ గౌళేశ్వరులు వీరె
[2]సురరాజగర్వాపహార పరాకు

తే. యవనసౌరాష్ట్రఘూర్జరాఖ్యాంగవంగ
కేకయావంతికోసలకేరళాది
దేశభూపాలకులు వీరె దేవ యనుచు
వేత్రహస్తులు వేర్వేఱ విన్నవింప. 12

క. రైవతకాగము చెంతఁ
దేవేంద్రునివనముకంటె దివ్యతరంబౌ
[3]పావనబలితోద్యానము
భావజజనకుండు చొచ్చెఁ బరమప్రీతిన్. 13

---

1 ద్వారవతి వీడి వెడలెను వనముఁ జూడ. 2 సురనాయకమదాపహారపరాకు. 3 పావనమై చెలువారెడి, యావనివారి చొచ్చె వేడ్కలలరారంగన్.

వ. మఱియును మన్మథ, జంబు, జంబీర, పున్నాగ, పారిభద్ర, సప్తపర్ణ, కుంజరాశన, జంతుఫల, ధనంజయ, వంజుళ, పుష్పఫలాళి, మాలూర, వట, బదరీ, నారంగ, భల్లాతకీ, హరిప్రియ, శాల్మలీ, కేదారాశోక, చాంపేయ, దాడిమామలకతమాల, బంధుజీవక, కురంటక, కోవిదారార్జున, క్రముక, నారికేళ, హింతాల, లవంగ, కదలీ, ఖర్జూర, పనసలును; దూరీకృతపథికాయాస వియద్గంగాతరంగిణీసంజాత కనకాంబుజాతాంతరచరద్రాజహంసగరుదుచ్చలితసమీరశాబకంబును; నానావిధవిహంగమసంకలితకలరవంబులును; ననవద్యమాధవావిర్భూతసకలకుసుమవికసితసౌరభ్యనిర్దేశితసకలతరుసముదయంబును; నిరంతరమందారమంజరీమకరందపానమత్తచంచరీకఝుంకారంబులు నత్యంతకోమలకిసలయఖాదనపీవరపికనినదంబులును; జారుపరిపక్వఫలరసభరితశుకరవంబులును; గమలోత్పల, రాజహంస, బక, జలచర, చరణాయుధషండమండితకమలాకరంబులును; జంపకజాతీకుందమల్లికాకుసుమకుంజపుంజంబులును; నేలాప్రవాళగుంజాలతావితానంబులుంగల్గి యొప్పుచున్న యుద్యానవనంబందు విహరించి యొక్కచో నిర్మలంబైన చంద్రకాంతోపలోజ్జ్వలవేదికాప్రదేశంబున సుఖాసీనుండై తరుణీసహస్రంబులు గొలువనుండె నపుడు. 14

క. ఆసవపానాపేక్షల
భాసిలు భామాచయంబు బహుమోదముతో

వాసించు మేటి వారుణి
యాసలు దీఱంగఁ గ్రోలి యచ్యుతునెదుటన్. 15

క. కిలకిల నవ్వుచు సోలుచుఁ
దలతలమని పరువులిడుచుఁ దమలోఁ దారుం
దలఁగఁగ నేరక రోయుచు
మలయుచుఁ బోవుదురు మత్తమధుపములగతిన్. 16

ఆ. మత్తు తెలిసి సతులు మాధవపదపద్మ
ములకు మ్రొక్కి కృష్ణ జలజనేత్ర
మధువిరోధి శౌరి మామాటలకు మీద
లెగ్గుఁ బెట్టవలవ దిందిరేశ. 17

వ. అని తదనంతరంబ. 18

సీ. పసిఁడికొప్పెరలందుఁ బన్నీరుఁ దెప్పించి
కుంకుమపూవందుఁ గూర్చి పేర్చి
చిమ్మనగ్రోవులఁ జెలరేఁగి చెలరేఁగి
గంధేభయాన లుత్కంఠ లగుచుఁ
గంసారిపైఁ జల్లఁ గంజదళాక్షుండు
కర్పూరగంధులఁ గదియఁ బట్టి
హేమపాత్రములచే నెలమితో వారింపఁ
బద్మాక్షు లందఱుఁ బద్మనాభుఁ

ఆ. జుట్టుకొన్ననపుడు సుందరాంగులమీఁద
శౌరి మీఱె; మఱియుఁ జాన లెల్ల
సరభసంబుమీఱఁ జల్లిఁ బోరాడుచు
హరి, సతులు, వసంత మాడిరపుడు. 19

వ. తదనంతరంబ. 20

క. జలజము లిందీవరములు
కలువలు కలహంసచయముఁ గలిగినకొలనిన్
జలజాక్షుఁడు గని యచ్చట
నిలిచెన్ బ్రియసతులుఁ దాను నిండినవేడ్కన్. 21

సీ. చూచితే రుక్మిణీ! చూతమహీజంబు
నీవంటఁ బూచెను నెమ్మితోడ
వీక్షింపఁ దిలకంబు విజవిగాఁ బూచెను
పలికినఁ బూచెను పరఁగ గోఁగు
మొగమెత్తఁ గనకంబు ముదముతోఁ బూచెను
దన్న నశోకంబు దనరఁ బూచెఁ
బాడిన మోరటపాదపం బొఁగి బూచె
ముఖసీధువునఁ బూచెఁ బొగడ పొగడఁ

తే. బొన్న పూచెను దరహాసమునను జూడు
కొమ్మ! గోరంట యాలింగనమ్ముచేతఁ
బూచె; వావిలి నిశ్వాసమునను ననుచు
నతనుజనకుండు ప్రమదంబు ననుకరింప. 22

క. జలకేళీప్రియుఁ డగుచును
జలజభవాద్యమరనుతుఁడు సంతోషమునన్
జలజారిముఖులతోడను
జలజాకరమధ్యసీమ సరగున నిలిచెన్. 23

సీ. గంధేభయాన దాఁ గరమర్థి నిల్వఁగాఁ
బంచాస్యవరమధ్య పట్టి పెనఁగ

పరిపక్వబింబోష్ఠి ప్రమదంబుతోఁ జీరఁ
గీరవాణి సతినిఁ జేరెఁ బ్రేమ
జైవాతృకానన సరగున నీడ్వఁగా
స్వర్భానువేణిక బలిమిఁ బట్టి
సారసలోచన సమ్మదంబున నీడ్వఁ
గౌముదీదరహాస కదిసి నిలిచె

తే. లలనలీరీతిఁ బెక్కండ్రు చలముతోడ
సరభసంబులు మిక్కిలి పరిఢవిల్లఁ
గదిసి కమలాకరంబునఁ గౌతుకమున
శౌరితోఁ గూడి జలకేళి సలిపి పిదప. 24

తే. సతులతోఁ గూడి వనమెల్ల సంచరించి
దివ్యరసఫలములతోడఁ దృప్తిఁబొంది
దేవనాయకమణి నిల్పెఁ దేజమెసఁగ
సరసమైనట్టి సహకార తరువునీడ. 25

తే. విమలచంద్రకాంతోజ్జ్వలవేదికలను
జిత్రకంబళములమీఁదఁ జెలువు మిగులు
పట్టుపుట్టముల్ పఱచిన పరుపులపయిఁ
సతులు గొలువంగఁ గూర్చుండెఁ జక్రధరుఁడు. 26

ఆ. నందనందనుండు నారీమణులతోడ
హితులతోడ భృత్యతతులతోడఁ
గలిసియుండ నపుడు కమలాప్తశేఖరుం
డస్తశిఖరిమీఁద నధివసించె. 27

క. వరసంధ్యారాగంబున
హరిచీఁకటి రెండుఁగూడి హరి దీప్తులతో
మురిపెమునఁ జూడ నొప్పెను
గురుతరనీలంపుఁ గెంపుఁ గూర్చినభంగిన్. 28

క. చొక్కపు నీలపుబరణిని
నక్కజముగ మృగమదంబు నదిమినభంగిన్
దిక్కులు నిండిన పిమ్మటఁ
బిక్కటిలెను నిరులగములు పెంపలరంగన్. 29

ఆ. జారచోరవరులు సంతోషమందిరి
సారసాళిచెలువు సమసిపోయె
జాజిమల్లెపొదలు చాలఁ బూచినరీతి
మింట రిక్కగములు మెండుకొనియె. 30

చ. కమల సహోదరుండు, వరకంధికిఁ దాఁ దనయుండు నిం
దిరా, రమణుమఱంది, షోడశకళానిధి, హరి, పయోజ
వైరి, లో, కములకుఁ జిత్తదోషణుఁడు కైరవకోటికిఁ
బ్రీతి రోహిణీ, రమణుఁడు దోఁచెఁ దూర్పున విరాజిత
కాంతిసువర్ణదేహుఁ డై. 31

తే. పూర్వదిక్కన్య ముంగురు ల్ముదముతోడ
దువ్వి వైచిన దంతపు దువ్వెన యన
షోడశకళాభిరాముఁ డై సొగసు మీఱఁ
జంద్రుఁ డుదయించె సంతోషసాంద్రుఁ డగుచు. 32

తే. కప్పురము ముత్తెపుబరణిఁ గ్రమ్మినటుల
క్షీరవారాశి యుప్పొంగి చెలఁగినట్లు

కులుకులొలికెడు హరికీర్తి వెలసినట్లు
పండువెన్నెల నిండె బ్రహ్మాండమునను. 33

తే. శౌరి సంధ్యాదిసత్క్రియల్ చక్కఁదీర్చి
దివ్య సరసాన్నములచేతఁ దృప్తిఁ బొంది
పరఁగఁ బూపాన్పుమీఁదను బవ్వళించి
నిండుమనమున నిద్రించె నెమ్మితోడ. 34

క. తెక్కలు విదళించుచుఁ గొన
ముక్కునఁ జరణములు దీటి పొలుపుగ దిశలన్
మక్కువ ముందటఁ జూచియుఁ
గొక్కొరొకో యనుచుఁ గోడిగుంపులు గూసెన్. 35

సీ. సారసశ్రేణికి సత్కాంతి చెన్నొందెఁ
గైరవమ్ములకెల్లఁ గలిగె దిగులు
చక్రవాకంబులు సంతోష మందెను
భయమబ్బెను జకోరపటలికెల్ల
భార్గవతేజంబు పరిహృతం బయ్యెను
బలుచనై చుక్కలు పరఁగె మింట
మీనకేతనుచొక్కు మేనెల్ల నిండెను
బతులరవములు ప్రబల మయ్యె

తే. నబ్జమండల మస్తాద్రియందు నిలిచె
దానవారాతి కీర్తనల్ తడచుగాను
బతనఁజేసిన భక్తులు పరిఢవమున
దిశలు తెలుపెక్క బల్లునఁ దెల్లవాఱె. 36

తే. దివిజపతిసౌధమాణిక్యదీప మనఁగఁ
బూర్వదిక్కాంతకుంకుమబొట్టనంగఁ
గమలములకెల్లఁ జెలికాఁడు తిమిరవైరి
భానుఁ డుదయించెఁ ద్రైలోక్యబాంధవుండు. 37

వ. అప్పుడు. 38

తే. జలజసంభవభూతేశసన్నుతుండు
నఖిలవిఖ్యాతమాయాదవాన్వవాయ
కలశపాథోధిచంద్రుండు లలితయశుఁడు
నీలనీరదగాత్రుండు మేలుకొనియె. 39

క. ఇనుఁ డుదయింపక మున్నే
దనుజకులాంతకుఁడు లేచి తద్దయు వేడ్కన్
వనజాకరతీరంబున
ఘనసంధ్యాక్రియలు దీర్పఁ గ్రక్కునఁ జనియెన్. 40

క. కుముదేందీవరహల్లక
కమలోత్పలపుండరీకగతహంసరథాం
గముల పటునాదచయముల
నమరెడు జలజాకరంబు హరి కనుఁగొనియెన్. 41

క. కని యాజలదేవతకును
వినయముగాఁ బ్రణుతిఁజేసి విధ్యుక్తముగాఁ
దనుజారి స్నానమొనరిం
చెను నిర్మలసరసియందుఁ జిత్తంబలరన్. 42

సీ. ధౌతవస్త్రంబులు ధరియించి తిన్నగాఁ
దిలకంబు మోమునఁ దీర్చి దిద్ది

యాచమనత్రయం బచరించి యల శివ
ప్రణవమంత్రము వేగ పఠనచేసి
పంద్రెండు పంద్రెండు పరువడి మార్జనల్
శిరమునఁ బదముల వరుసఁజేసి
భాస్కరమంత్రంబు భక్తితోడ జపించి
యనలాస్త్రమంత్రంబు లమర నుడివి
తే. యంజలిపుటమున నుదక మమర నునిచి
బ్రహ్మపరదండములు వేగ పరఁగఁ బలికి
యసురమత్తేభనివహపంచాననుండు
మిత్రునకు ముదమున నర్ఘ్య మిచ్చుచుండ. 43

వ. అప్పుడు. 44

క. మణిపురమున కధిపతియగు
మణిమంతునిసుతుఁడు గయుఁడు మాన్యుఁడు తేజో
ఘృణి గంధర్వశిరోమణి
గణుతింపఁగ సద్గుణుండు ఘనబలుఁ డవనిన్. 45

సీ. మితిలేని భక్తితో చతురాస్యుఁ బూజించి
కరమర్థి వరములఁ గాంచినాఁడు
పెక్కువత్సరములు ముక్కంటిపాదంబు
లర్చించి యస్త్రంబు లందినాఁడు
దిక్పాలకులచేతఁ దెరగొప్పఁ గప్పముల్
గైకొనె మిక్కిలి గౌరవమున
గరుడోరగాదులఁ గయ్యంబులో గెల్చి
జయముఁ జేకొనినాఁడు సాహసమున

తే. నమరగంధర్వబృందంబు లతనిగొలువ
మణిమయం బగుదివ్యవిమానమెక్కి
చారుసౌవర్ణవరరత్నసాంద్రుఁ డగుచు
గయుఁడు మణిపట్టణంబేలు ఘనుఁడు వేడ్క. 46.

క. సురమార్గమధ్యమంబునఁ
జరగుచు నిష్ఠీవనంబు సరగునఁ జేయన్
దిరముగ వాయువశంబున
హరికరపుటమందుఁ బడియె నతివేగమునన్. 47

తే. పడిన నిష్ఠీవనంబప్డు పాఱవైచి
దహనువిధమున నుగ్రుఁడై దనుజవైరి
చూచి యెవ్వరు లేకున్కిఁ జోద్యమందు
సమయమున జలదేవత చక్రి కనియె. 48

సీ. ఓదేవతాధీశ! యోదైత్యసంహార!
భాస్కరశశినేత్ర! పరమపురుష!
యీదుష్టవర్తను నెఱిఁగింతు వినవయ్య
చెన్నొందు నిషధాద్రిశిఖరమునను
మణిపట్టణంబేలు మణిమంతునిసుతుండు
గయుఁ డనుగంధర్వఘనవిభుండు
కమలజువరమునఁ గడుఁ గ్రొవ్వి తృణముగఁ
జూచును శతమఖ సురలనెల్లఁ
తే. జారుపుష్పకరథమెక్కి సతులుఁ దాను
సకలవిధములఁ జరియించు సాహసమున

జలజగర్భునికొలువంగఁ జనుచు వాఁడు
నేఁడు నీ కెగ్గొనర్చె నో నీరజాక్ష! 49

క. అని జలదేవత పలికిన
విని యాగంధర్వవిభుఁడు బెదరునవణఁకన్
ఘనకోపాటోపంబున
ననిమిషమార్గంబుఁ గలఁగ నార్చుచు నంతన్. 50

క. బలభద్రసాత్యకులతోఁ
బలికెను జక్రాయుధుండు పటురోషముతోఁ
బలుచలమునఁ బోనీయక
నెలమిని నే గయునిఁ ద్రుంతు నెమ్మెయినైనన్. 51

ఉ. వారిధిఁ జొచ్చి డాగినను వారిజగర్భుఁడు వచ్చి కాచినన్
ధారుణి క్రిందికేగినను దాఁగిన నద్రిగుహాంతరంబులన్
మారవిరోధి గాచినను మానక దిక్పతులెల్ల వచ్చినన్
బోర వధింతు నాగయుని పో విడిపుచ్చిన నన్ను నవ్వరే?

ఉ. ధీరత నాప్రతిజ్ఞ విను తెల్పెద నోబలభద్రసాత్యకుల్!
పోరున నీనిఁగుత్సితుని మూఢ దురాత్ముని వీతపుణ్యునిన్
భూరివివేకశూన్యుని ప్రపూరితకల్మషమత్తచిత్తునిన్
ధారణి నాగయాహ్వయునిదర్పమణంపకయున్నఁ బ్రజ్ఞయే!

క. ఘోరాహవరంగమ్మున
భూరిసుదర్శనము చేతఁ బోనియ్యక గం
భీరత ద్రుంపక యున్నను
ధారణి దేవకికి ముద్దు తనయుఁడనె దగన్. 54

తే. ధీరుఁ డారీతిఁ బల్కి మేన్ దేజరిల్ల
జలములను గ్రుంకి ధౌతవస్త్రములఁ గట్టి
దనుజసంహారి తిలకంబుఁ దనరఁ దీర్చి
యినున కర్ఘ్యంబు లిడుచుండె వినయమునను. 55

వ. అప్పుడు. 56

మ. ఘనుఁడౌనమ్మణిమంతసూనుఁడటు మేఘద్వారమార్గంబునన్
జనుచో నిట్లశరీరవాణి యనె నో సన్మార్గసంచార! నిన్
దనుజధ్వంసి వధింతునంచుఁ బలికెన్ దప్పింప లేరెవ్వరే
ననఘా! శంకరుపాలికీవుచనుమా! మాలస్యమింకేటికిన్. 57

క. ఆకాశవాణి పల్కనఁ
బ్రాకటముగ విని గయుండు పరువడి ననియెన్
శ్రీకాంతుఁడు నన్నూరక
భీకరముగ నేలచంపు బ్రేమను జెపుమా. 58

క. నావలన నేరమేమియొ
భావజజనకుండు పద్మభవుపదయుగమున్
సేవింపఁ బోవువాని న
దేవిధమునఁ జంపఁబూనె నెఱిఁగింపు తగన్. 59

వ. అనిన నభోవాణి గయునకి ట్లనియె. 60

క. భానున కర్ఘ్యము లియ్యఁగ
దానవహారుకరపుటమునఁ దటుకునఁ బడియెన్
నీనిష్ఠీవన మది గని
మానక నినుఁ జంపఁబూనె మాధవుఁ డకటా! 61

క. ఆయన చేసిన ప్రతినన్
గాయజహరుఁ డైన వచ్చి కాదన వశమా?

పోయి పరమేశుఁ గనుఁగొని
వేయివిధంబుల నుతించి వెలయుము ధాత్రిన్. 62

చ. అన విని యాగయుండు వెస నంబుజసంభవుఁ డున్న వీటికిన్
ఘనతరచింత చేతను బ్రకంపితగాత్రుఁడు హీనతేజుఁడై
కనులను బాష్పముల్దొరఁగఁ గంసవిభేదిప్రతిజ్ఞ పల్కుచున్
జనియె భయంబునన్ విగతశౌర్యవివేకగభీరధీరతన్. 63

వ. ఇట్లు గ్గయుం డత్యంతసంతాపంబున నిలిచినచోట నిలువక సత్యలోకంబునకుం బోయి బ్రహ్మసదనంబుఁ బ్రవేశించి యందు. 64

సీ. కౌండిన్య మాండవ్య కణ్వాత్రి గౌతమ
మైత్రేయ శౌనక మందపాల
శాండిల్య కౌశిక జమదగ్ని మౌద్గల్య
వరతంతు కశ్యప వామదేవ
వత్స మార్కండేయ వాల్మీకి గాలవ
పుండరీ కాగస్త్య పులహ కపిల
వాసిష్ఠ నారద వ్యాస శుక మతంగ
హారితాదిసన్మును లమరమర్త్య
తే. గరుడ గంధర్వ యక్షులు వరుసఁగొలువ
భారతీదేవితోఁ గూడి ప్రబలియున్న
కమలసంభవుపదములు గాంచి మ్రొక్కి
కరములు మొగిడ్చి వినుతించె గారవమున. 65

సీ. జయ భారతీనాథ! జయ సత్యసంచార!
జయ భక్తమందార! సదయహృదయ!

జయభానుసంకాశ జయవార్ధిగంభీర
జయమౌనిపూజిత చరణకమల
జయజగదాధార జయసత్యలోకేశ
జయసద్గుణోల్లాస శక్రవినుత
జయవిష్ణుసన్నుత జయసృష్టిసత్కర్త
జయహంసవాహన జలజగర్భ

తే. నిన్ను వర్ణింప శక్యమే నిగమవేద్య
నన్ను రక్షింపవే వేగ నాథ! యనుచు
విష్ణుపదవాణి చెప్పిన విధము లెల్ల
విన్నవించినఁ బరమేష్ఠి వెఱఁగుపడియె. 66

వ. మఱియు గయుండు సురజ్యేష్ఠునకుఁ బునఃపునఃప్రణామం
బులు చేసి యి ట్లనియె. 67

తే. నీవు జగములెల్ల నిర్మింపఁ గర్తవే
యఖిలసురలకెల్ల నగ్రజుఁడవు
హరికిసముఁడవీవు కరుణతో రక్షింపు
జలజలోచనుండు చంపకుండ. 68

వ. ఇట్లు గయుండు ప్రాణభయంబున హిరణ్యగర్భచరణకమల
నిక్షిప్త మస్తకుండై లేవకుండిన నతండు సుముఖుండయి
యతనింజూచి కరపంకజంబున లేవనెత్తి యూఱడించుచు
ని ట్లనియె. 69

చ. శరనిధిమత్స్యరూపమునఁజయ్యనఁజొచ్చిమహోగ్రవృష్టి చే
సురరిపు సోమకాసురునిఁజూచి తదీయకఠోరవక్షము

త్వరతరదంతఘట్టనల నుక్కడఁగించి యనంతవేదముల్
పసపడిఁ దెచ్చిమాకిడిన పంకజనాభుఁ డతండె యెన్నఁగన్.

చ. అమరులు పూర్వదేవతలు నబ్ధిమథింపఁగ మందరాగ్రభా
రము నవలీలమోచి యపరాజిత దీప్తఘులీశరీరుఁ డై
విమలపయోజలోచనుఁడు విశ్వగురుండు సురాళికెల్లఁ బ్రే
మమున సుధారసంబిడిన మాధవుఁ డాతఁడె పో గయా
హ్వయా. 71

క. కిటియై హిరణ్యాలోచను
జిటులుచుఁ గోపించి త్రుంచి సితదంష్ట్రాగ్రం
బటుచాపి భూమినెత్తిన
పటుతరగాత్రుం డతండె పావనచరితా. 72

క. క్రూరుఁడగు హేమకశిపుని
ధీరతవక్షంబు చించి దివిజులు మెచ్చన్
ధారణిలోఁ బ్రహ్లాదుని
గారవమునఁగాచినట్టి ఘనుఁ డతఁడె గయా. 73

క. జలపాత్ర ముంజిగోచియు
సలలితముగఁ దనకునొప్పఁ జనివామనుఁడై
బలిఁ బాతాళముఁ జేర్చిన
బలునేర్పరి యితఁడె సుమ్ము భాస్కరతేజా. 74

క. ఇలఁ గల రాజుల నెల్లరఁ
జలమునఁ బోనీక పట్టి సమరావనిలోఁ
దలలెల్ల దొరఁగఁ జేసిన
యలజమదగ్నికిఁ దనూజుఁ డతఁడె గుణాఢ్యా. 75

క. ఇనకులమునఁ బుట్టిశివుని
ధనువువిఱిచి ధరణిసుతకు ధవుఁడయి దశకం
ఠుని మస్తకమును దునిమిన
ఘనుఁడౌ శ్రీరాముఁ డతఁడె గంధర్వపతీ. 76

క. సురరిపు భామలవ్రతములు
సరగున భంగంబుచేసి సమ్మోదముతో
హరునకు శరమై నిలిచిన
వరుఁడగు భానుం డతండె వరగంధర్వా. 77

క. ధరఁగల కిరాతవర్యుల
శిరములు ఖండించివైచి శ్రితజనకోటిన్
నిరతము సంరక్షించిన
సిరివరుఁడగు కలియతండె సిద్ధము గయుఁడా. 78

క. ధరణీభారము మాన్పఁగఁ
బరువడి నారాయణుండు భాసురలీలన్
వరవసుదేవ సుతుండయి
వరకృష్ణుం డనఁగ వెలసె వరగుణ నిలయా. 79

వ. అని మఱియును గృష్ణుండు చతుర్దశ భువనాధీశ్వరుండు సకలమాయలకెల్ల నధికారియు జగద్గురుండు విశ్వరక్షణార్థంబై భూతలంబున నుద్భవించె ఆ మహానుభావు నతుల ప్రతిజ్ఞమాన్ప నింద్రాది దిక్పాలక సురగరుడోరగాదుల కలవిగాదు. నిన్నురక్షించెడి వారిం జెప్పెదవినుము.

సీ. కైలాసవాసుని గజచర్మపరిధానుఁ
గాలకూటాశ్రయుఁ గామహరునిఁ

బార్వతీచిత్తాబ్జ భాసురపద్మాప్తుఁ
జారుభాసురగాత్రుఁ జంద్రమౌళి
నంధకాసురవైరి నావ్యోమకేశుని
భీమేశునతజనాభీష్టదాయి
సకలాగమస్తుతు సచ్చిదానందుని
సద్భక్తమందారు సగుణరూపుఁ
తే. బ్రమథనాథుని సద్భక్తపటలపాలు
సకలలోకాధినాథు నక్షరునిభవుని
సదమలజ్ఞాన నివహుని సర్వమయుని
జేరి ప్రార్థించి సేవింపు చిత్తమలర. 81

తే. శంబరాంతకసంహారి చంద్రమౌళి
భూతనాథుండు ముక్కంటి పురహరుండు
నురగహారుఁడు సర్వజ్ఞుఁ డుగ్రమూర్తి
కాలకంఠుఁడు నినుఁగాచుఁ గరుణవెలయ. 82

క. హరిచేసినట్టి ప్రతినం
బరువడి మాన్పంగ లేరు పాకారిముఖుల్
ధర నెవరికైనఁదరమా
కరిచర్మాంబరుఁడు దక్కఁ గావఁగ నిన్నున్. 83

క. ఆలస్యము లేకరుగుము
కైలాసాచలమునకును గడువేగమునన్
భాలాక్షుమరుగుఁ జేరుము
వాలాయముగాఁచు నతఁడు వదలకనిన్నున్. 84

క. అని బ్రహ్మ బుద్ధిసెప్పిన
వినిగయుఁ డతిభక్తి మ్రొక్కి వేవేగమునన్
గనకరథ మెక్కి యప్పుడె
ఘనకైలాసమునకేగెఁ గాచుననుమతిన్. 85

క. ఆగిరిరాజముఁ గనుఁగొని
వేగవిమానంబు డిగ్గి వినయముతోఁ బన్
సాగిలి ప్రణమిల్లి గయుం
డాగౌరీశాద్రి నెక్కె హర్షంబలరన్. 86

క. కైలాసంబని తలఁచిన
వాలాయము శివుఁ డొసంగు వాంఛలుతృప్తిన్
మేలైన సతుల సుతులను
బాళిన్ ధనధాన్యచయము పంతంబలరన్. 87

క. అని యిట్లు వినుతిసేయుచు
మనమున వెతలెల్లమఱచి మౌనిగణములం
దనకనుఁ దమ్ములఁజూచుచుఁ
జనియెను శివునిలయమునకు సంతసమెసఁగన్. 88

సీ. ఇంద్రాదిదిక్పతు లెల్లరుసేవింప
మౌనీంద్ర బృందంబు మమతగొలువఁ
బసిఁడిబెత్తములచేఁ బరికింపనందియు
హరిబరాబరిచేయ నాదరమున
గణనాథభైరవ కార్తికేయాదులౌ
కొడుకులు ముద్దులు గులుకుచుండఁ

జేరిచెంగటనే కుబేరుఁడువర్తింపఁ
దలఁచుగా భక్త బృందముపఠింప

తే. హరుఁడు నవరత్నసింహాసనాగ్రమందుఁ
బార్వతీదేవితోఁగూడి ప్రమదమెసఁగఁ
దారకాధిపు మిన్నేటిఁ దలనువాల్చి
యున్నశంకరుఁగనె గయుఁ డొప్పమెఱయ. 89

వ. కని యందు శంకరు నివ్విధంబున స్తుతియించె. 90

దండకము. శ్రీమన్మహాపార్వతీచిత్త నీరేజహంసా జటాజూట భారా మహాకార లోకాధినాథా! మహాసారపద్మా పరబ్రహ్మవేదాంతవేద్యా మహావిష్ణుపాదోద్భవాధారకైలాస సంచార మౌనీంద్ర హృత్పద్మమార్తాండ సర్వాత్మకా వ్యాస మైత్రేయ కౌండిన్య వాసిష్ఠ శ్రీవత్స కణ్వాది నానామునిస్తోత్ర సర్వాపదాళిప్రహా దైత్యసంహారకా దేవపుణ్యస్వరూపా లలాటాక్ష యోతాండ వామోద చిద్రూప మృత్యుంజయా శూలపాణీ భవానీధవా కాలకంఠా కపర్ది విరూపాక్ష సర్వజ్ఞ ఘోరాంధకారా వియోగోద్భవాదంతిచర్మాంబరాలంకృతా ధూర్జటీభర్గశర్వాచిదానందమూర్తీ యచింత్యా నిరాకార మాకార కోంకార పంచాక్షరీరూప శ్రీతారకబ్రహ్మమార్తాండ తత్త్వజ్ఞభక్తాళి దారిద్ర్య గాఢాంధకారార్కదైతేయ పంచాననా శూర సద్భక్త వీర్యప్రదీప్తాంగ, మీసత్ప్రభావంబు వర్ణింపఁగాలేరు వాగీశ దేవేశ లోకేశులున్ రుద్రమూర్తీ భవద్దివ్య పాదాబ్జయుగ్మంబులన్ నిత్యసద్భక్తిఁ బూజించెదన్ సత్కృ

పం గావవే నిస్తులాత్మా మహాత్మా సదైశ్వర్యపుత్రాది భోగంబులన్ దీర్ఘ మహా నాయురారోగ్యసత్కీర్తి సత్సంప దల్ పిమ్మటన్ ముక్తి మోదంబుతో నిచ్చి రక్షింపవే నీల కంఠా నమస్తే నమస్తే నమః. 91

క. అని యిట్లు వినుతిచేసిన
కనుఁగొని యలపూర్వభవుఁడు కడుమోదమునన్
మును పెన్నఁడు నీవదనము
ఘనకాంతిం దగ్గకుండు గంధర్వపతీ. 92

తే. హీనమైనది నీదుముఖాంబుజంబ
దెవరినుండియొ యింతటి యెగ్గుగలిగెఁ
దెలియఁ గావలె నంతయుఁ దేటపఱపు
మనిన విని శంకరున కిట్టులనియె నతఁడు. 93

మ. గిరిజాధీశ్వర చంద్రశేఖర భవా గీర్వాణరాజస్తుతా
యరవిందానన శ్రీపతిస్తుతహరా యాద్యంతశూన్యాసుకుం
జరచర్మాంబర దేవతామునినుతా సద్భక్తమందార! యా
మురసంహారియెనన్నుఁజంపఁగడఁగెన్ ముక్కంటిరక్షింపవే.

తే. అఖిలలోకనాథ యమ రేంద్రపూజిత
ఫాలనేత్ర నన్ను బ్రదుకఁజూడు
ప్రాణభీతిచేతఁ బరువడివచ్చితి
నిన్ను నమ్మినాఁడ నీలకంఠ. 95

వ. అని మఱియుఁ బునఃపునః ప్రణామంబు లాచరించి గంధర్వ విభుండు చంద్రశేఖర పాదారవిందములపై ఫాలప్రదేశ మ్మునిచి దైన్యంబున రక్షింపు మని నయనంబుల నశ్రుక

ణంబులు దోరగఁగరంబుల నమ్మహాదేవుని పదసరసిజంబులు బిగఁబట్టి లేవకుండిన దయాసముద్రుఁడగు నా పార్వతీ రమణుండు భక్తపరాయణుండు గావున నానంద బాష్ప ప్రవాహంబు లతనిపైఁబడఁగ సకలభువనాభయదం బైన దక్షిణకరంబున లేవనెత్తిన గయుం డిట్లనియె. 96

సీ. వసుదేవ తనయుండు వనమున కేతెంచి
భానునకర్ఘ్యంబు భక్తినిడఁగఁ
గరమర్థి వినువీథిఁ గనకరథంబెక్కి
కమలజుసేవకై కదలిచనుచు
నిష్ఠీవనముసేయ నీరజాక్షునిపైనఁ
బడిన నుగ్రుండయి ప్రతినచేసె
గగనవాణియువార్త కరుణను దెల్పంగఁ
గమలగర్భునినేను గనఁగఁబోవ

ఆ. హరిప్రతిజ్ఞరీతి నప్పనిఁదీర్పంగ
నతనినుండి నన్ను నాదరించి
కావ నెంతవాఁడఁ గదలిపొమ్మని నన్ను
నీదుచెంత కనిచె నీలకంఠ. 97

వ. అనిన శంకరుండు తనమనంబున. 98

ఆ. ఏమిసేయువాఁడ నితని నెవ్విధిఁగాతు
హరికి నాకు భేద మరయఁగలదె
యతఁడు నేనుఁ బోర నగులోకనాశము
గయుని నేలపనిచెఁ గమలభవుఁడు. 99

వ. అని యిట్లు దక్షాధ్వరధ్వంసి దనమనమ్మున వితర్కించుచు డోలాయమానమానసుండయి గయునిఁ జూచి యిట్లనియె.

మ. వరవైకుంఠ విహారుఁ డచ్యుతుఁడు సర్వజ్ఞుండు విష్ణుండు భా, స్కరచంద్రాక్షుఁడు నిర్గుణుండు గుణికంజాతోద్భ వాండోదరుం, డరిసంహారియు శేషశాయి వసుదేవాధీశ సత్పుత్రుఁడై, ధరణీభారము మాన్పఁగా వెలసె దైత్యధ్వంసి కృష్ణుం డనన్. 101

ఉ. ఆయదువంశశేఖరుని యద్భుతమైన ప్రతిజ్ఞమాన్పఁగా న్యాయముగాదునాకు వినునావచనంబు గయాఖ్యయిప్పుడే పోయిము రారిపాదముల భూరివివేకములోడఁగొల్వుమా యేయపరాధముంగొనకయి ప్డెక్షమించుఁగృపావిధేయుఁడై.

ఉ. ఆవసుదేవసూనుఁడు దయాంబుధిశాంతుఁడు భక్తపాలుఁ డుర్, బావనమూర్తినీట మఱిపాలనుముంచిన ముంచుఁగా కనిక్, గావఁగ లేరదెవ్వరును గంసవిరోధియుఁ దక్క వేగ మే, పోవుము కృష్ణుపాలికిని బ్రోచును నిన్ను గయా! కృపాబ్ధియై. 103

క. ఈరీతిని శివుఁడాడిన
భూరిభయాబ్ధినిమునింగి పొక్కుచుగయుఁడా
గౌరీపతి సదనంబును
నారూఢిగ వెడలినడిచె నార్తుం డగుచున్. 104

వ. ఇట్లు గంగాధర మందిరంబు వెడలివచ్చి కొంతదూరంబు పోయి యొక్క నిర్మలస్థలంబున నిలిచి గయుండు తన మనమ్మునందు. 105

తే. మూఁడుమూర్తులు సములుగమునివరులొగిఁ
జెప్పుచుందురుగా చాలఁ జెనఁటు లగుచుఁ
గనకగర్భుఁడు హరుఁడును గావవైరి
దనుజసంహారి యొక్కఁడే దలఁచిచూడ. 106

సీ. సర్వప్రపంచంబు సరవితో సృష్టించు
కమలగర్భుఁడునన్ను గావఁడాయె
నెల్లలోకములకు నేలికయైనట్టి
చిత్తజవైరి రక్షింపఁడాయె
వీరికన్నను ఘనుల్ వెదకిచూచిన లేర
దెవ్వరు రక్షింతు రెలమిమీఱ
నాపాపదైవంబు నన్నిట్లుచేసె నిం
కేచాయకరుగుదు నెందుఁజొత్తు

తే. హరికడకు నిప్పుడరిగినఁ గరుణలేక
ప్రాసముద్గరముఖములఁ బట్టియపుడె
చక్రధారను దలద్రుంచు సాహసమున
నందుఁబోరాదు పోయిన నాపద లగు. 107

సీ. ఉదధిమధ్యముఁజొచ్చి యొదిగియుండెదనన్న
హరిమాయ యదియును నరసిచూడ
నగ్నికుండములోన నణఁగియుండెదనన్న
నాతనిసంచార మందుఁగలదు
తారకాపథమునఁ దగిలియుండెదనన్న
రవిమధ్యమున హరిరమణనుండు

విపినభూములకేగ వెదకి కైకొనివచ్చి
బంధించి తలద్రుంచి పాఱవైచు
తే. నిట్టి పరహింస ప్రాపించె నేమి యనుదు
నిది పరిహరించినను‌ఁ బ్రోవ నెవ్వఁడోపు
శివునిమాటలు నమ్ముచుఁ జెలఁగి నృహరి
సముఖమున కేగ నచ్చోటఁ గ్రమము తప్పు. 108
క. తత్తఱపడి యేఁబోయినఁ
జిత్తజ జనకుండు చూచి చిత్తములోనన్
హత్తిన కోపముతోడను
గుత్తుక సిగ గోయు ననుచుఁ గుంభినిమీఁదన్. 109
సీ. ధారణిబెబ్బులి దాసర్ల విందుకై
పిలచినఁ బోదురే ప్రియము లేక
మునిముచ్చు తావచ్చి కనుమదాఁటించెద
రమ్మన్నఁ జనుదురే రసికులయినఁ
బగవారితోఁ బొందు పాటించి సేతురే
క్షితిలోన నేలాటి చెనఁటులైన
నేను శ్రీకృష్ణుని నెఱనమ్మిపోయినఁ
బ్రాణహానియెగాని బ్రదుకు లేదు
తే. గానపోరాదు పోయినఁ గార్యహాని
చిక్కి తప్పించుకొనరాదు సిద్ధమిద్ది
వెనుకఁజింతించు టదియెల్ల వెఱ్ఱితనము
పూర్వకర్మఫలంబేల పోవనిచ్చు. 110

క. మును నేఁ జేసిన తపముల
మనమున సంతోషమంది మన్ననతోడన్
వనజభవుఁ డిచ్చెవరములు
పనిగొనరాదాయె నెంతపాపాత్ముఁడనో. 111

సీ. ఈవార్త మాతల్లి యేపాటివిన్నను
బుత్రశోకంబున బొరలుచుండు
గారాబమునఁబెంచు గంధర్వపతియైన
మణిమంతుఁ డేప్రొద్దు మదినిగుందు
కలనైనభీతి వాక్కుల నోర్వఁగాలేని
యనుకూలవతి చాల నడలుచుండు
నేవేళనైన నన్నెడఁబాయఁగాలేని
సుతులు వారెంత దుఃఖితులగుదురొ

తే. కటకటా విధి నెవ్వరు గడువలేరు
పూర్వకర్మఫలంబులు పోవనీవ
దెవ్వరైనను గృష్ణున కెదురులేరు
నేఁడు నిర్యాణకాలంబె నిండవచ్చె. 112

తే. గిరులమీఁదను వర్షముల్ గురిసినట్లు
కడఁగి యడవిని వెన్నెల గాచినట్లు
భస్మనిక్షిప్తఘృతము లేవను దలంప
నేను జేసినతపమెల్ల నెగడదాయె. 113

వ. అని గయుండు మనంబునఖేదంబునుం గొని వెడవెడఁ గన్నీరుమున్నీరుగాఁ బ్రలాపించుచు భూతలంబునఁ బొరలుచు జగత్సృష్టికర్తలు చతురానన చంద్రశేఖరులు వీరి

కన్న ఘనుండు కృష్ణుఁడు దక్క నన్ను రక్షించువాఁ డీ జగంబున నెవ్వం డోకో హా దైవంబా యని ప్రాణంబు హరికూరక నేలాగుననొప్పింతు నేమిసేతుననుచు జంకి సుతబాంధవుల గాననైతిఁ గటకటా యనుచుఁ గుందు చున్న సమయంబున. 114

సీ. ఘనసారచంద్రికా కమనీయగాత్రంబు
గళమునమాలికల్ గ్రాలుచుండ
సురనిమ్నగాస్నానపరిపూర్ణకుంభంబు
స్ఫటికాక్షమాలికపాణి నమర
బాలభాస్కరరుచిప్రహతోర్ధ్వపుండ్రంబు
తులసిమాలికలు సుస్థితిని మెఱయ
నష్టాక్షరీమంత్ర మాత్మలోనెన్నుచుఁ
బ్రణవ మెల్లప్పుడు పఠన చేయ
తే. గానవిద్యాప్రవీణుండు మానిఘనుఁడు
కనకగర్భాంగజాతుండు కలుషహరుఁడు
భూరి వీణాధురీణుండు నారదుండు
గయునికడవచ్చి నిలిచెను గౌరవమున. 115

క. వచ్చిన నారదుఁ గనుఁగొని
హెచ్చిన శోకంబుమాని హితమతితోడన్
ఒచ్చంబులేని భక్తిని
చెచ్చెఱ నామునికిమ్రొక్కెఁ జిత్తంబలరన్. 116

తే. గయునిగన్గొని యమ్మౌని కాంతుఁ డనియె
నెటకుఁబోయెదు దుఃఖించె దేమికొఱకు

నెవరివంకను నీభీతి యెట్లుగలిగెఁ
దెలియబల్కుము విధమెల్ల దేటపడఁగ. 117

వ. అనిన విని గయుండు ప్రమోదభరాక్రాంతహృదయుం
డగుచు శతానందనందనునకుఁ బునఃపునఃప్రణామంబులు
గావించి యతివినయంబుగా నిట్లనియె. 118

సీ. వినవయ్య మునినాథ విన్నవించెద నీకు
నున్నవిధంబెల్ల నొప్పుగాను
గయుఁడని నాపేరు గంధర్వవిభుఁడను
కమలజుసేవకై కదలిపోవ
దేవకీతనయుండు దినమణికర్ఘ్యంబు
లిచ్చుచో నుమిసితి నెఱుఁగ కదియుఁ
వనజాక్షుకరపుటంబున యదృచ్ఛావిధిఁ
బవనవశంబునఁ బడినఁజూచి

తే. యల్గి యెంతయు మదిఁగల యాగ్రహమున
నిట్లు చేసిన దుష్టాత్ముఁ డెచటనున్నఁ
బట్టి తెప్పించి ప్రాణముల్ బాపకున్న
వాసుదేవుఁడ నేగాను వసుధలోన. 119

క. హరి యిటు పల్కిన శబ్దము
సురాపగావాణినాకు సురుచిరలీలన్
ఎఱిఁగింప నేను నప్పుడె
పరుగిడితిని శారదేశు భవనంబునకున్. 120

క. పరమేష్ఠిఁ గాంచి తత్పద
సరసీరుహములకునెఱఁగి చతురానన నే

హరి కపరాధముఁ జేసితిఁ
బరువడి రక్షింపునన్నుఁ బావనమూర్తీ. 121

వ. అని యిట్లు పితామహునకు హరిప్రతినవిధంబంతయు నెఱింగించిన నతఁడు నన్నుఁ గనుంగొని యిది నేను శమింపలేను గంగాధరుమందిరంబునకుం జను మనిన నేను బంచశరారిపాలికిం జని శరణంబువేడ నతండును రక్షింపఁ బొమ్మనిన నిచట నిలిచి భయపూరితచిత్తుండనై నిన్నుఁ గాంచి ధైర్యంబునొందితిని. 122

చ. అనవిని నారదుండు కరుణాంబుధియైగయుఁజూచియిచ్చటన్
ఘనతరశోకవార్థిఁబడఁ గారణమేలొకొ నీవు నిప్పుడే
చనుము కిరీటిపాలికి విచారముమాని యతండు ధీరతన్
నిను నవలీలఁబ్రోచు నిదినిక్కమునమ్ముమునాదు మాటలన్.

వ. అనిన విని నారదునకు గయుం డి ట్లనియె. 124

ఉ. మునికులసార్వభౌమ సురపూజితపాదపయోజయోదయా
వననిధియబ్జసంభవభవా మహనీయశశాంక తేజ యా
ఘనుఁడు భుజంగకంకణుఁడు గావగలేక మురారిపాలికిం
జనుమనె శక్రసూనునకు శక్యమె నన్ బ్రదికింపనారదా.

వ. అనిన గయునకు హిరణ్యగర్భసంభవుం డి ట్లనియె. 126

మ కరుణాఢ్యుండుధరాభరంబుడుపు కాంక్షుంబుట్టె శ్రీకృష్ణుఁడే
యరిసంహారకుఁడింద్రసూతియనఁగానత్యంత శౌర్యోన్నతిన్
బరఁగున్ లోకవిలక్షణుండు నుగ్రపావారాశిలీలాత్ముఁడై
కరమర్థిన్ జనియించెనీవసుధలోఁగల్యాణసంధాయియై. 127

ఉ. ఆవసుదేవనందనుని యద్భుతమైన ప్రతిజ్ఞకడ్డమై
కావఁగఁజాలు శత్రుకులఖండనుఁడాహవభీకరాకృతిన్
భావజవైరి వచ్చినను బట్టునువీడఁడు మేటిధీరుఁడై
నావచనంబు నీమదిని నమ్ముము పొమ్మిఁకఁ బార్థుపాలికిన్.

వ. అనిన గంధర్వుండు త్రిదశమునీంద్రున కిట్లనియె. 129

ఉ. తాపసవర్య ఫల్గుణుఁడు దానవవైరికి సఖ్యుఁడంటివా
శ్రీపతికర్జునుండు నటు శీఘ్రమె పొమ్మనిపంచె దిప్పుడే
నీపలు కెట్లు నమ్మఁదగు నీరజసంభవ చంద్రశేఖరుల్
ఈపనిఁ జేయలేమనిరి యింద్రకుమారునిఁ జేరనేమగున్. 130

వ. అనిన మణిమంతుని సుతునకు శతధృతిసుతుం డిట్లనియె. నీవు నరునిమానవమాత్రునిగాఁ దలంపకుము. అతఁడు పాశుపతాది దివ్యాస్త్రపాణియై యుద్ధభూప్రదేశంబున నిలిచిన హరిహరబ్రహ్మాదిదిక్పాలకామరయక్షరాక్షసుల కజేయుండగు నతనియతుల ప్రభావంబు చెప్పెద నాకర్ణింపుము. 131

సీ. యాదవావళినెల్ల నవలీలను జయించి
 దేవకీపుత్రికఁ దెచ్చినాఁడు
సకలరాజన్యుల సమరంబులో గెల్చి
 కప్పముల్ గైకొనె గౌరవమున
శివునినే మెప్పించి చెలువొందఁ బాశుప
 తాస్త్రంబుగొనివచ్చె నాక్షణంబె
దిక్పాలకులచేత దివ్యబాణంబులు
 కరమర్థిఁ గైకొనె సురలు మెచ్చ

తే. ఖాండవం బగ్ని కిచ్చెను గరుణచేతఁ
జిత్రమలరఁగ యుద్ధైక జితులఁ జేసెఁ
గాలకేయాదిదానవ గణమునెల్ల
నరసముఁడెవండు పరరాజనందనుండు. 132

క. విషధరహారుఁడు ప్రమథులు
విషధరహారవాహనుండు విబుధగణంబుల్
విషధరశయనుఁడు వచ్చిన
విషగళుచరణంబు లాన విడువఁడు నిన్నున్. 133

తే. ప్రాణభయములేదు పరువడిగాఁ బోయి
యతని ద్వైతవనమునందుఁ గాంచి
శరణుఁజొరుము వాఁడు శత్రువునుండి నిను
గాచు సందియంబు గలుగదిందు. 134

వ. అనిన విని మునికి గంధర్వవిభుఁ డిట్టులనియె. 135

క. మునినాథ నన్ను రక్షిం
పను జాలిన పౌరుషమున భాసిల్లెడు నా
ఘనుఁ డెచటనుండు నచటికిఁ
జనియెద నాకానతిండు సరగునమీరల్. 136

వ. అనిన మునీంద్రుఁ డిట్లనియె. 137

క. ద్వైతవనం బన ధరణిని
ఖ్యాతముగా నుండు నందుఁ గార్ముకధరుఁ డై
భూతేశ భక్తవర్యుఁడు
పూతచరిత్రుఁడు సురేంద్రపుత్త్రుండుండున్. 138

క. అని చెప్పి మానిచంద్రుఁడు
తననెలవున కరిగె గయుఁడు తద్దయు వేడ్కన్
గనకరథారూఢుం డై
జనలోకమునకు నితాంతజవమున వచ్చెన్. 139

వ. ఇట్లు గయుండు భూలోకంబునకుఁ జనుదెంచి ఖర్జూర మాలూర పున్నాగ సారంగజంబీరబిల్వామల కాశ్వత్థ పిచుమందనారికేళార్జున వటమాతులుంగలవంగ కీచకధాత్రీతింత్రిణీసరళాదితరుబృందంబులు గలిగి దివ్యకుసుమసౌరభంబును మలయపవనసంచారంబునయియొప్పు నైద్వైతవనంబు ప్రవేశించి యందు. 140

సీ. వజ్రవరచ్ఛాయఁ బరఁగు దేహమువానిఁ
బూర్ణచంద్రునిబోలు ముఖమువానిఁ
గమ్రగాండీవంబు కరమున గలవాని
విమలాబ్జపత్రనేత్రములవానిఁ
బార్వతీపతిపదభక్తిగల్గినవాని
లలితత్రిపుండ్రభాలంబువాని
జగదేకవీరుఁ డై చాలనొప్పెడువాని
యదుసూనువిక్రమ మమరువాని

తే. సత్యవచనుని సుగుణుని జక్రిసఖుని
స్వర్ణనగధీరుని సమరజయునివీరు
వనజబాంధవతేజుని వజ్రిసుతుని
గాంచె నచ్చట గంధర్వకాంతుఁ డెలమి. 141

తే. వేదమానవుండు పెద్దనిక్షేపంబుఁ
గన్నరీతి నవని గయుఁడుచూచి
నమ్మవచ్చు వీని నాప్రాణములనేఁడు
కావఁగలఁ డితండు కరుణతోడ. 142

వ. అని గయుండు సంతోషపూరిత స్వాంతుండగుచుఁ దన
మనంబున. 143

సీ. ఈరూపు నీచూపు నీయంద మీచంద
మీరాజనందను సిద్ధతేజ
మీసొంపు నీపెంపు నీబాహువీర్యంబు
నీశౌర్య మీధైర్య మీఘనంబు
నీఖ్యాతి యీపొంక మీకృపారసములు
నీప్రతాపాటోప మిట్టిచెలువ
మీనీటు లీచెన్ను నీసొగసెమ్మెయి
నీమేటి యాకార మేరియందుఁ
తే. జూడమిటువంటిధీరుని క్షోణియందుఁ
బ్రాపు చేకొంటి నా కింక భయములేదు
ఇతఁడు రుద్రుఁడో దుర్జయ శతమఖుండొ
యిందిరాపతితనయుఁడో యెన్న నిపుడు. 144

సీ. పురవైరి యితఁడైన భోగిహారము లెవ్వి
హారుఁడుగాఁ డితఁడెన్న నరుఁడుగాని
విబుధేశుఁ డితఁడైన వేయిగన్నులు లేవు
హరిహయుఁడును గాఁడు నరుఁడుగాని

కమలాక్షుఁ డితఁడైన గరుడవాహన మేది
హరిగాఁ డితం డిల నరుఁడుగాని
చిత్తజుఁ డితఁడైనఁ జెఱకువిల్లును లేదు
స్మరుఁడుగాఁ డీతఁ డానరుఁడుగాని
తే. ధనువు శరములు చేపట్టి దనరినాఁడు
నిపుణుగప్పిన యట్టికొన్నిప్పనంగ
సమరవిజయుండు సాహసచక్రవర్తి
సందియము లేల? యీతఁడే శక్రసుతుఁడు. 145

తే. ఇతఁడె దైవంబు రక్షకుఁ డీతఁడౌను
నితఁడె గురుఁడును దలిదండ్రు లెలమితోడ
నితఁడె నాప్రాణమునుగాచు నెంచిచూడ
హాని లే దిఁక వెఱవను హరికి నిపుడు. 146

క. అని గంధర్వవరుండును
గనకరథము డిగ్గివచ్చి కవ్వడి యితఁడే
యని తలఁచి వేగ తత్పద
వనజములకు మ్రొక్కి లేచి వాంఛితమలరన్. 147

చ. కరములుమోడ్చి యాగయుఁడు కన్నులఁదోయకణంబులొ
ల్కనో, పరమదయాంబురాశి ప్రతిపక్షమదేభ మృగేం
ద్ర కావవే, శరణనివచ్చినాఁడ నృపచంద్రహిమాద్రిసమా
నధైర్యని, ర్జరపతి పుత్రపూర్వసురసంహార,మిత్రత్రిలోక
సన్నుతా. 148

వ. అని భయాతురుండయిన గయుంజూచి పురందరనందనుం
డిట్లనియె. 149

క. హరిహరహిరణ్యగర్భులు
గరుడోరగసిద్ధసాధ్య గంధర్వపతుల్
ధరవిభులువచ్చి పోరిన
వెఱవను నినుఁబట్టియీయ విమలగుణాఢ్యా. 150

క. వెఱవక నాకడనుండుమి
తరులకు నొప్పింపనిన్ను ధర్మసుతుని శ్రీ
చరణసరోజములానఁగ
నెఱనమ్ముము నాదుమాట నిక్కముసుమ్మీ. 151

సీ. శరణన్న పగవారి సరవితో రక్షించు
పంతంబునా దిది పరఁగవినుము
నమ్మివచ్చినవారి బొమ్మనిపట్టియ్య
హరిహరుల్ వచ్చిన నడలనేను
నినుఁగాచి రక్షింతు నీకు నెవ్వరినుండి
ప్రాణభీతియెటులు ప్రాప్తమయ్యె
నీపేరదేమందు రెందు నీవుందువ
దెవ్వరుపొమ్మని రిపుడు నిన్ను

తే. వెఱపునీకేల మదిలోన విడువు మనుచు
సమ్మదముతోడ నభయహస్తమ్ము నిడిన
నవ్వి గంధర్వపతియును కవ్వడికిని
మ్రొక్కివిన్నప మొనరించె ముదముతోడ. 152

సీ. వినవయ్య యర్జున వీరాగ్రగణ్యుండ
శ్రీనిషధాచల శిఖరమందు

మణిపట్టణం బేలు మణిమంతు తనయుండ
గంధర్వపతినైన గయుఁడ నేను
వాణీశు శ్రీపాద వారిరుహంబులు
పూజింపఁదలఁచి యేఁబోవు వేళ
రాక్షససంహారి రవికర్ఘ్యములనీయ
నిష్ఠీవనంబప్డు నీరజాక్షు
తే. నంజలిపుటమునను బడ నాగ్రహమున
జక్రధారను దలఁద్రుంచి ధాత్రివైతు
ననియెనంచు నంబరవాణి ననుగుఱించి
వనజసంభవు కడకేగుమనియెఁ గరుణ. 153

ఆ. గగనవాణి పలుకఁ గడుభయంబునఁబోయి
యజునిఁగాంచి మ్రొక్కి హరిప్రతిజ్ఞ
విన్నవింప బ్రహ్మ విస్మయంబునుబొంది
నీలగళుఁడుగాచు నిన్ను జనుము. 154

వ. అనిన. 155

క. పరమేష్ఠి పంపఁగాఁ జని
హరునకు హరిప్రతిన చెప్పి యాపన్నుఁడనై
పరమకృపానిధి ప్రోవుము
మురహరుఁడును మీరుపములు ముజ్జగములలోన్. 156

వ. అనిన విని యామహానుభావుం డిట్లనియె. 157

తే. హరికినధికులు నవనిలే రరసిచూడఁ
గంససంహారి వినుము నిన్ గరుణఁగాచు

నతనిపాలికిఁ జనుమన్న నంత నేను
శోకమునసుంటి సురముని చూచి పలికె. 158

మ. హరికిసఖుండు శాత్రవమహాటవికిన్ దవానలుండు శూరుఁడున్
బరమకృపాసముద్రుఁడు ప్రభంజనడింభక కేతనుండు శం
కరునని గెల్చినట్టి త్రిజగన్నుతుఁ డాహవభీకరుండు శ్రీ
హరికిసమానుఁ డాతఁడు మహాధృతినీకభయంబొసంగెడున్.

వ. అని పంచిన వచ్చి. 160

క. మునిపతిచే విన్నంతయుఁ
గన నిజమయ్యెడిని ధృతిని గనఁగల్గితి నా
యనుమానమెల్లఁ దీఱెను
మనుజేశ్వర నేఁడు కీర్తి మహిలో వెలసెన్. 161

వ. అని యిట్లు గయుండు తనవృత్తాంతంబంతయు విష్వచ్చు
నకు విన్నవించిన నర్జునుండు డోలాయమానమానసుం
డగుచుఁ దనమనంబున. 162

క. ఘోరాహవమునఁ గృష్ణుఁడు
ధీరుండయి నిలిచెనేని దితి సుతవైరుల్
గానీ రణమున నింద్రుఁడు
పోరగలే రతనితోడ భువనత్రయినిన్. 163

క. శౌరికి నాకును గల్గెమ
హాభీలరణంబు నేఁడు హరితో సమమై
పోరఁగఁగలనా యనిలో
గౌరిపతి నాదుపాలఁ గలఁడో లేఁడో. 164

సీ. లాక్షాగృహంబున లయముగానీయక
కరుణించి మముఁ బ్రోచె గారవమునఁ
బాంచాలిమానంబు భంగంబు గాకుండ
రక్షించె సభయందు రమణతోడఁ
బవమానతనయుని ప్రాణముల్ పోకుండ
విషము నిర్విషము గావించె నప్పు
డేవేళఁదలఁచిన నావేళ నేవచ్చి
భూరిదయాళువై బుద్ధినొడువు
తే. నట్టి శ్రీకృష్ణునకునాకు నమిత్రమైన
చుట్టఱికమెల్ల నేఁటితోఁ జూరఁబోయె
మమ్ముఁ జూడంగఁ దలపఁడు మాధవుండు
కల్పితంబయ్యె దురవస్థ గయునిచేత. 165
తే. గయునివృత్తాంతమెల్లను గ్రమముతోడ
మొదటఁదెలియక యూరకె మోసపోతి
నభయమిచ్చితిఁ దప్పిన నవనిపతులు
నిందసేతురు శౌర్యంబు క్రిందుగాఁగ. 166
వ. అని యిట్లు చింతించి సంపూర్ణధీరుండగుచు గయునింవో
డ్కొని ఫల్గునుండు యుధిష్ఠిరుపాలికింజని యతని పాదా
రవిందంబులకు నమస్కరించి ముకుళితకరకమలుండై నిలిచి
యున్న కిరీటిం జూచి ధర్మజుం డిట్లనియె. 167
క. అన్నా కవ్వడి యివ్విధి
ఖిన్నుఁడవయి యుండనేమి గీర్వాణేంద్రుల్

నిన్నంటి పోర వెఱతు రి
దెన్నఁగ నీకెదురుగలరె యీభూస్థలిలోన్. 168

తే. ఎవ్వఁ డీ పూజ్యుఁ డిందుల కేలవచ్చె
నితని యభిధాన మేమందు రెచటనుండు
ననిశమని ధర్మజుండన నర్జునుండు
విన్నవింపఁగ దొడఁగె నావివరమెల్ల. 169

తే. మణిపురాధీశుఁడగుమణిమంతు సుతుఁడు
గయుఁ డనెడివాఁ డితం డెన్న ఘనగుణుండు
ప్రాణభయమున మిగుల నాపన్నుఁడగుచు
నభయమడిగిన నిచ్చితి శుభచరిత్ర. 170

ఉ. భానుసమాను తేజ ననుఁ బ్రాణభయంబున వచ్చి కావవే
మానవనాథ! యన్నవిని మన్ననచే నభయంబొసంగితిఀ
ఏనును నీదుసన్నిధికి నిప్పుడవచ్చితి నింతచెప్పఁగాఁ
గాన ననుంగటాక్షమునఁ గావవలెఀ సమర్తినందనా. 171

వ. అని యిట్లు సునాసీరసూనుండు గయుని వృత్తాంతంబంత
యుఁ బరేతరాట్తనయున కెఱిఁగించిన నయ్యజాతశత్రుం
డార్తసంరక్షకుండును దయాపరమూర్తియు నగుటం జేసి
కిరీటి కిట్లనియె. 172

క. నమ్మించి పగతు చేతికిఁ
గొమ్మని యందిచ్చినట్టి క్రూరుని నెపుడే
నిమ్మహిమర్త్యులు రోతురు
పిమ్మట నరకముననుండుఁ బెక్కుదినంబుల్. 173

క. నీవే దిక్కని వచ్చిన
పావనమతిఁ గ్రోధముడిగి పగతుని నైనం
బ్రోవఁగ వలయును శూరులు
పో విడువఁగరాదు గయుని భూరివివేకా. 174

క. మొదల నభయమ్మొసంగియుఁ
దుది నాచేఁ గావనంగ దోషమువచ్చున్
ఇది క్షత్రియులకు ధర్మము
ముదమున నీగయునిగావ మోసముగల్గున్. 175

సీ. దుర్యోధనుఁడుచేయు దుష్టయత్నము లెల్ల
మనమీఁద రాకుండ మట్టుపెట్టి
కలలోనఁ దలఁచినఁ గ్రక్కునఁ దా వచ్చి
చాలబుద్ధులు చెప్పు సదయుఁ డగుచు
మనయందుఁ బక్షంబు మానఁ డేవేళను
గంటిరెప్పఁగఁగాచుఁ గ్రమముతోడ
దైవంబు దాతయుఁ దల్లియుఁ దండ్రియు
గురుఁడును నాతఁడె యరసిచూడ

తే. కృష్ణునకు నెగ్గుచేయఁగ నేలయన్న
నభయమిచ్చిన మాటయే వ్యర్థమగును
దైవయత్నంబు దప్పింపఁదగునె మనకుఁ
జాలు వగవంగఁ దగునయ్య శక్రతనయ.

తే. కానిపనులెల్ల నెప్పుడు కానెకావు
కలుగవలసిన పనులెల్లఁ గలుగుచుండు

నీకు వశమానె మానంగ నీకలహము
ననిన నతనికి ననియె నాయర్జునుండు. 176

చ. తహతహ లేల యీపనికి దైవతకృత్యము దప్పనేర్చునే,
యహివరతల్పుఁ డిత్తఱిని నర్జుననందును దెంపుచూపునే,
బహువిధమాయలాహరికిఁ బార్థుఁడు నాతఁడునొక్కఁటేసు
మీ, మిహిరసమాన తేజ గయు మేదినిఁగావ శుభంబు చే
కురున్. 177

వ. అని మఱియు నిట్లనియె. 178

తే. గయునికొఱకును హరిహరుల్ కయ్యమునకుఁ
గదసివచ్చిన నిల్తురే కయ్యమందుఁ
జాలఁబోరఁగ హరితోడ సమయమిదియ
సంశయంబేల యింతకు శమనతనయ. 179

క. ఇప్పటికి గయునిగాచుట
నొప్పిదమగు మనకుఁ దుదను నురుబలములతో
నప్పరమాత్ముఁడు వచ్చిన
నప్పటి కెటులైనఁగాని యనఘచరిత్రా! 180

వ. అనిన విని సమవర్తితనయుండు సహోదరపరివృతుండై
యాగయుని నిర్భయుంగావించి తమయొద్దనుంచుకొని
యుండె దదనంతరంబ. 181

చ. హరితనదోయిటన్ రవికి నర్ఘ్యములిచ్చిన పిమ్మటన్ గనెం
బరమదురాత్ముఁడౌ గయునిఁ బాండుతనూజుల యొద్దనుండు
టన్, ఉరుతర దివ్యదృష్టి ననువొందఁగఁ జూచి ప్రమోద
చిత్తుఁడై, సరగున నాప్రతిజ్ఞ యిఁక సార్థకమయ్యెఁ దలంచి
చూడఁగన్. 182

సీ. సకలసద్గుణశాలి సంతతోల్లాసుని
శాంతుని నకలంకు సత్యవచనుఁ
బూర్ణకళాయుక్తుఁ బుణ్యచారిత్రుని
వీర్యవంతుసుగుణు వేగవంతు
రావించిపలికెను రమణతోడుతనీవు
ద్వైతవనమునకుఁ ద్వరగనేగి
యమతనూభవునకు నతనిసోదరులకు
ధర్మచారిణియైన ద్రౌపదికిని
తే. ధౌమ్యునకుఁ జెల్పు మీవు భద్రమ్ములడిగి
పార్థునకు నేనుఁ జేసిన ప్రతినఁదెల్పి
గయుని వేవేగఁ దెమ్ము నాకడకు నిపుడె
యనుచుఁ బల్కినఁ జనె నతం డతిరయమున. 183

క. వచ్చెను మారుతరయమునఁ
జొచ్చెను నాద్వైతవనము సురుచిరలీలన్
అచ్చటఁ బాండుకుమారులఁ
జెచ్చెఱఁ జేరంగఁ జనియెఁ జిత్తం బలరన్. 184

మ కనె నల్లంతట వేగవంతుఁడు మహాకల్యాణసంధాయులన్
మనుజాధీశ్వరులన్ దయాజలధులన్ మాధుర్యసల్లాపులన్
ఘనతేజోమయగాత్రులన్ సుజనులన్ గంభీరులన్ ధీరులన్
వనజాతాయతనేత్రులన్సుగుణులన్ భాగ్యైకవారాసులన్.

వ. అందు మహనీయతేజోవంతుఁడై భీమార్జున నకుల సహదేవ పరివృతుండై ధౌమ్యాదిమును లాశీర్వదింప గీర్వాణ సేవితుం డైనసహస్రాక్షుపగిది నున్నయాయజాతశత్రునిం

జూచి తదీయ సమస్తదిగ్దేశమూర్ధాభిషిక్తరాజన్యమూర్ధో పరిభాగవిన్యస్తవజ్రాది కాంచిత శాతకుంభమణిస్థగిత కిరీట కాంత్యుజ్జ్వలచ్చరణ రాజీవయుగమునకు మ్రొక్కి లేచి ముకుళితకరకమలుండై యున్న వేగవంతు నాలోకించి యర్హాపీఠంబున నుండనియమించి బహుమానంబుగ ని ట్లనియె. 186

క. రామునకు శౌరి కాతని
భామామణులకును వృష్ణి పతులకు నెల్లన్
క్షేమమె గదయ్య చెప్పుమా
మామీఁదను గరుణగలదె మధుమథనునకున్. 187

వ. అనిన వేగవంతుఁడు యుధిష్ఠిరునకు మృదుమధుర వాక్యముల ని ట్లనియె. 188

సీ. వసు దేవసూనుండు ద్వారకాపురినుండి
పాండుసూనుల మేలు పరఁగ దెలిసి
రమ్మన్న వచ్చితి రాజేంద్ర గుణసాంద్ర
క్షేమమే మీకెల్లఁ జెప్పవయ్య
యనవుడు ధర్మజుఁ డతిముదమ్మొదవంగ
మధుసూదనునికృపామహిమ చేత
నలరెడు మమ్ముల నశుభంబు చెందునే
కుశలంబు మాకెల్లఁ గొదువ లేదు
తే. తానె మమ్ములఁ బోషించుఁ దల్లిఁదండ్రి
దైవము సఖుండు బంధుండు త్రాతగురుఁడు

వీరుఁ డని నమ్మినారము విశదముగను
వెన్ను నకు విన్నవింపుము వేగవంత! 189

వ. అనిన వేగవంతుండు సహస్రాక్షాత్మజున కిట్లనియె. 190

చ. వినుము కిరీటి! శ్రీధరుఁడు విశ్వగురుండు భుజంగశాయి
యున్, ఇనసమతేజుఁ డీశ్వరుఁడు నింద్రసురార్చితపాద
పద్ముఁడున్, ఘననిభగాత్రుఁ డార్తజన కల్మషనాగమృగేం
ద్రుఁ డచ్యుతుం, డనఘుఁడు దేవకీసుతుఁడు యాదవనాయ
కుఁ డంపవచ్చితిన్. 191

వ. అనిన నర్జునుం డిట్లనియె. 192

క. వచ్చిన వివరం బేదియొ
చెచ్చెఱ వినిపింపవయ్య చెవులుతమిగనన్
బచ్చవిలుకాని జనకుం
డిచ్చటికే లనిపె నిన్ను? నెంతయు వేడ్కన్. 193

వ. అనిన వేగవంతుం డిట్లనియె. 194

క. హరి కెగ్గు చేసి గయుఁడే
మెఱుఁగనివానివలె నేఁడు హితమతితోడన్
మురియుచు నున్నాఁ డిక్కడ
సరగునఁ గృష్ణుకడఁ జేర్పు సరసగుణాఢ్యా! 195

క. ఆగోపాలుఁడు గయునిన్
వేగమె తెమ్మనుచుఁ బలికె విజయుఁడ! వినుమా
జాగేల నీవు చేసెద
వాగజవరదుకడ కన్పుమా గయు నింకన్. 196

ఉ. యాదవభూషణుండును, దయాహృదయుండు ఘనుండు
మిమ్ములన్, మోదముతోడఁ బ్రోచెఁగద మూర్ఖపుబుద్ధిఁ
దలంప నీతియే, యాదనుజారిదగ్గరకు నంపుమ యీగయు
నిపుడె వేగమే, పోదుము నేను నీతఁడును భూధరధారుఁడు
మెచ్చఫల్గునా! 197

చ. అన విని శక్రసూనుఁడు రయంబున నప్పుడు వేగవంతునిన్
గనుఁగొని కాందిశీకులను గాంతలగోగణవిప్రభామలన్
మునుకొని వంచనల్ సలుపు మూఢులకెక్కుడనై నఁగల్గునే
ఘనతరకీర్తిపుణ్యములు కాలునిచేతిభయంబుదప్పునే? 198

వ. అనిన వేగవంతుం డిట్లనియె. 199

క. హరితోఁ బగ నీకేటికి
దురమునకున్ నిన్నుఁబిలువ దోర్బలశక్తిన్
నరుఁడ! నిలువంగ నోపవు
సరగున గయు నీయనయ్య చక్రధరునకున్. 200

వ. అని యనేకప్రకారంబులఁ జెప్పిన వినక ధనంజయుండు.

క. నేనేల గయు నొసంగుదు
దానవహరునకును హరుఁడు ధాతయు సురలున్
బూనికఁ బోరికి వచ్చిన
దానికలుక వేగవంత తరలుమపురికిన్. 202

వ. అనిన వేగవంతుండు ద్వారకాపురంబునకుం బోయి దేవకీ
నందను చరణారవిందంబులకుఁ బ్రణమిల్లి పాండుతనయుల
క్షేమంబును ధర్మరాజు ప్రియభాషణంబులును బురందర

తనయుని విరసపుమాటలను జెప్పిన విని కృష్ణుం డరుణ
నేత్రాంచలుం డగుచు నిట్లనియె. 203

సీ. మదముకన్నులదోట్టి పొదలుచునున్నవాఁ
డెదురు తన్నెఱుఁగక వదరినాఁడు
కడు గ్రొవ్వివ్యాఘ్రాగంబు గట్టుతో నెదిరించి
దాఁకినట్లుగ వీఁడు దలఁచినాఁడు
వీని బలంబెంత వీఁ డనఁగా నెంత
వీని శౌర్యంబెంత విస్తరింపఁ
గేసరితోదంతి కెరలిపోరినరీతిఁ
బులితోడఁ గుందేలు పోరినట్లు
తే. గర్వమునుబొంది యెఱుఁగక కడఁగి నేఁడు
మాకు నెదురాడుచున్నాఁడు మత్తుఁ డగుచు
నద్రి పరమాణువులయట్టు లరసిచూడ
మత్తకరివోమవాసియు మాకుఁ దనకు. 204

వ. అని పలికి. 205

క. దూరీకృత రిపుగణు న
క్రూరుని నహిమాంశుతేజు గురుకీర్తిధరుఁ
వారిధి గంభీరు వరుఁ
జేరఁగఁ దాఁ బిల్చి కినుక చెలఁగంబలికెన్. 206

చ. ఎఱుఁగుదు వీవు నామహిమ నింద్రకుమారుని శౌర్యధైర్య
ముల్, ఎఱుఁగుదు వింతనీవిపుడె యిందుల నందుల తార
తమ్యముల్, ఎఱుఁగుదు పాండురాజసుతుఁ డేటికి నింత
మదించె వేగ నీ, వరిగి కిరీటికిందెలిపి యాగయునిం గొని
రమ్ము నేర్పునన్. 207

క. హరి యాజ్ఞాపించిన స
త్వరగతి నక్రూరుఁ డరిగి పార్థునితోడన్
నిరుపమ మధురవచనముల
జరపెను నొక కొంతసేపు సమ్మదలీలన్. 208

వ. తదనంతరంబ. 209

ఉ. వారిజలోచనుండు యదువంశసుధాంబుధి పూర్ణచంద్రుఁ
డున్, ధీరుఁడు శూరుఁడున్ ఘనుఁడు దేవశిఖామణి దీన
భక్తమం, దారుఁడు దైత్యమత్తగజదారుణకేసరి శేష
తల్పుఁడున్, నీరద నీలవర్ణుఁడు వినిర్మలగాత్రుఁడు పంప
వచ్చితిన్. 210

తే. అనిన నక్రూరుఁ గనుఁగొని యర్జునుండు
సదమలాత్మకుఁ డై యప్డు ముదముతోడఁ
బంకజాక్షుఁడు నిన్నేల పంపెనిటకుఁ
దెల్పు వేగమ నాకు సుధీవతంస. 211

వ. అని యింద్రతనయుం డడిగిన నక్రూరుం డిట్లనియె. 212

సీ. ద్వారకాపతితోడ వాదంబునీకేల
నతిబలాఢ్యుం డాతఁ డరసిచూడ
నఖిలజగచ్ఛ్రేణి యతనిలోపలనుండు
భావింపఁగాఁ బరబ్రహ్మమాతఁ
డతనితో నెదిరించి యనిమొన నిల్తురే
యజ్ఞభవసురేశ్వరాద్యమరులు
దానవాధీశుల దండింప మదిఁగోరి
హరికృష్ణుఁడై భువి నవతరించె

తే. ఘనుఁడు లోకేశ్వరుఁడు భక్తకాముదుండు
మిమ్ము రక్షించు ననిశంబు మేలు సేయు
వెఱ్ఱిబుద్ధుల విడిచి యోవిజయ! నీవు
హరికిఁ గోపంబు రాకుండ నను పు గయుని. 213

సీ. మధువిరోధిని నీవు మార్కొనవలదయ్య
తల్లిదండ్రి గురుఁడు దైవమతఁడు
నిగ్రహానుగ్రహ నిపుణుఁడాతం డగు
నఘటనాఘటనుండు నఘహరుండు
పాలునీళ్లనుగూడి పరఁగియుండినయట్లు
శౌరి నీవునుగూడ సరసమాను
మానవవల్లభ! మఱచిమాధవుతోడ
ఘోరకలహ మిది కోరవలదు

తే. గయుఁడు హరికపరాధియై భయము లేక
నీకడకు వచ్చియున్నాఁడు నేఁడు వీనిఁ
జక్రధరుపాలికనుపుము చలముమాని
యనిన నక్రూరుతోన నె నర్జునుండు. 214

ఆ. ప్రాణభయము చేతఁ బరువడియే తెంచి
కావవయ్య నన్నుఁ గావుమనుచు
నడలి వేఁడుకొన్న నభయమ్మొసంగితి
గయుని నేలనిత్తుఁ గ్రమముదప్పి. 215

వ. అదియునుం గాక. 216

సీ. శిబియుఁ గావఁడె తొల్లి చేపట్టిపక్షిని
దయతోడ నప్పుడ ధరణిలోన

నార్తుఁడై వచ్చిన యావిభీషణుఁజూచి
రమణ రక్షింపఁడె రాఘవుండు
శరణాగతులనెల్ల శత్రులచేతికి
నర్పించి రే తొల్లి యవనిపతులు
భూపుల ప్రతినలు పొల్లుపోవునెయెందు
శిలమీఁద వ్రాతలై చెలఁగుచుండు
తే. మమ్ముఁ బా నెట్లు రక్షించె మమతతోడఁ
దనవలనగాదె నేర్చితి ధర్మమరయ
వినుము గుణధుర్య! గంధర్వ విభునినేను
బట్టియిత్తునె? దేవకీ పట్టికిపుడు. 217

క. స్వర్గాధీశుఁడు నిర్జర
వర్గంబును గమలజుండు వరదిక్పాలుల్
భర్గుఁడును గూడి రాఁగ ని
సర్గస్థైర్యమునఁ బోరఁజాలుదు ననిలోన్. 218

క. అని సవ్యసాచిపల్కిన
విని యక్రూరుండుపోయి వినయముతోడన్
వనజాతాయతలోచనుఁ
గని యనె మీయాజ్ఞ చేతఁ గవ్వడికడకున్. 219

వ. చని మీరానతిచ్చిన తెఱంగంతయు విన్నవించితి నతండు
విని మూర్ఖుండై యాడినమాటలు విన్నవించెద నవధరిం
పుము. 220

సీ. వినవయ్య శ్రీకృష్ణ విజయునిమాటలిం
కేమనిదెల్పుదు నిపుడు నీకు

దేవరయానతి తెఱఁగెల్ల వినిపింప
　　నీతులఁ బలికెను నేర్పుతోడఁ
దానుగయునిఁ జంపఁ దలకొనియున్న నే
　　నాగయునిం బ్రోతు నవనిలోన
మాటాడి తప్పరు మాన్యరాజన్యులు
　　కలనైన బొంకరు కల్లగాదు
తే. ఫాలనేత్రుండు పోరిన భయము లేక
గయుని రక్షింప నేమైనఁగాని వేగ
కదలుమక్రూర యాహరికడకు నీ వ
టంచుఁ బుత్తెంచెఁ బార్థుఁడో యమలచరిత! 221

వ. అనిన నప్పుండరీకాక్షుండు క్రోధానలదందహ్యమాన మానసుండై చటులకోపస్ఫూర్తి నిగుడ భ్రుకుటీకృత నిట లుండై సుభద్రను రావించి యిట్లనియె. 222

తే. రమ్ము వినుము సుభద్ర నీరజదళాక్షి!
నీపతికిని దెలియఁజెప్పు నీతి మెఱయఁ
గాకయున్నను మనబంధు కలహమిపుడు
పుట్టు వంశంబు చేటుగా బూవుఁబోఁడి! 223

క. అని చెప్పి వీడు కొల్పిన
మనమున భయసంభ్రమములు మఱి యుప్పొంగ_
వనితారత్నము మ్రొక్కెను
తనయన్న పదాబ్జములకుఁ దద్దయుఁ బ్రీతిన్. 224

వ. తదనంతరంబ. 225

తే. జిలుగుపుత్తడి సరిగంచు చీరగట్టి
రాజితంబైన పైఠిణి రవికఁదొడిగి
పుష్పమాలిక గొప్పునఁ బొసఁగఁజుట్టి
చందనము మేన నలఁదెను సంభ్రమమున. 226

సీ. కమనీయనవరత్నఖచితకంకణములు
హస్తాబ్జయుగమున నమరఁజేర్చి
హురుముంజిముత్యాల సరములు మెడనుంచి
ముత్యపు ముంగరల్ ముదియనునిచి
మాణిక్య నిర్మిత మంజులతాటంక
ములుకర్ణయుగమున నలవరించి
మగరాలనమరిన మంచియొడ్డాణంబు
కౌనునధరియించి కౌతుకమునఁ

తే. బసిఁడి యందెలు పదములఁ బాదుకొల్పి
కనకరంజిత వస్త్రము కడఁకఁగట్టి
రత్నముద్రికలనువ్రేళ్ల రమణనునిచి
భువనమోహనరూపంబు పొలుపుమీఱ. 227

వ. ఇట్లు శృంగారించుకొని. 228

సీ. రమణిపాదంబులు రమ్యప్రవాళముల్
కరికరంబులనేలు తరుణితొడలు
వరనీలములఁగేరు వనజాక్షినూగారు
సకియచన్నులుచక్ర సమతఁదాల్చు
విద్రుమరుచిమించు వెలఁదుకకెమ్మోవి
రాకేందుబింబంబు రమణిమోము

కాముమార్గణములు కమలాక్షిచూపులు
జలధరంబునుగేరు సకియకొప్పు
తే. పడఁతి పలుకులు శుకపికభాషణములు
గంధసింధుర మదలించు కలికినడలు
చంద్రికాస్ఫూర్తి నిందించుఁ జానవగవు
తరుణి తనుకాంతి గెలుచును మెఱపుఁదీఁగ. 229

తే. సకియనాసికతోడను సరియుఁగాక
నవ్వీమునుకొని తలవంచె నువ్వుపువ్వు
అలినిబాసిన సంపెఁగ యవనిగలిసి
హాలమునను జొచ్చెమఱియు భూతలమునందు. 230

ఆ. తరుణిమోముఁజూచి సరిగాను దానని
కమలవైరి చేరె గగనసీమ
దర్పణంబుపోయి దాఁగెను సిగ్గుతో
నబ్జకాంతి రేయి నణఁగియుండె. 231

ఆ. భామమోముతోను బ్రతితామరనవచ్చుఁ
గర్కశతవహించి కదలిచనియెఁ
జంచలంబులయ్యె సామజహస్తముల్
పారలుపోయికలిసి శిరమువంచె. 132

ఆ. సకియమోవిచూచి సాటిగాదనిపోయి
యమరసీమనిచ్చె నయ్యమృతము
దొండపండువిరిసెఁ దోయజాననలచేఁ
గట్లుపడెను పగడ గర్వమణఁగ. 233

క. ఆరమణిని జేసినయా
వారిజభవుఁ డెంతవాఁడొ! వర్ణింపంగాఁ
గూరిచెఁ గలువలశంఖము
సారసనాళములశ్రీల జతతాఁ జేల్లన్. 234

తే. సానదీర్చినకందర్ప శస్త్రమనఁగ
నిందిరాత్మజుపట్టపు టేనుఁగనఁగఁ
గమలనాభతనూజుని ఖడ్గమనఁగఁ
బంచశరు బాణమనఁగ సుభద్రయొప్పు. 235

తే. మేటి కేసరిఁదరుమును బోటినడుము
సైకతంబులమించును సకియపిఱుఁదు
లతివనడకలుహంసల నపహసించుఁ
దీఁగమెఱుపులనగునింతి దేహకాంతి. 236

చ. కులికెడు గబ్బిగుబ్బలును గొప్పపిఱుందులు మందయాన
ముల్, జలరుహపత్రనేత్రములు చారుసుధాకరుఁబోలు
వక్త్రముల్, జలధరకాంతిఁ గేరుజేడ చక్కెరమోవియు
ముద్దుపల్కులుల్, సలలితకంబుకంఠమును జక్కని నాసిక
చానకుల్ దగున్. 237

సీ. శంబరారిశరంబు సానబట్టినరాలు
నికరంపురాపొడి నేర్పుతోడ
మిన్నేటినెత్తమ్మి మేదించి లెస్సగాఁ
గాశ్మీరరజమందుఁ గలియఁగ్రుమ్మి
పన్నీరుగంధంబుఃబలుమాఱు చిలికించి
యదనుతోఁగ్రక్కునఁ బదనుజేసి

సంతోషచిత్తుఁడై చతురాస్యుఁ డీచెలిఁ
జేసెఁగాఁబోలు నీ క్షితితలమునఁ

ఆ. గాకయున్నఁగలదె యేకన్యకకునైన
నీశరీరకాంతి యీసుగంధ
మీవిలోకనంబు వెలసెడు నీసొంపు
నీగుణంబుఁజూడ నింతికలరె. 238

వ. అని జనులెల్లఁబొగడ రూపరేఖావిలాసంబున నొప్పుచున్న
సుభద్ర యన్నయనుమతంబున సీమంతినీసంఘంబుగొలువఁ
బ్రమోదంబునఁ బదియాఱవన్నె బంగారు పల్లకినెక్కి-
ద్వైతవనంబునకువచ్చి. 239

సీ. సహకారజంబీరచందనఖర్జూర
పారిజాతాశోకపారిభద్ర
కుంజరాశనతాళమంజులహింతాళ
కురువకమన్మథకోవిదార
భాసురమాలూరపనసపుష్పపలాశ
సారంగపున్నాగనారికేళ
దాడిమీతింత్రిణీద్రాక్షామలకసాల
సప్తపర్ణకపిత్థచంపకాది

తే. సకలతరుసంఘములు సరస్సంఘములును
మహితసురభిళకుసుముముల్ మందగంధ
వాతములచేతఁ జెలఁగు నాద్వైతవనముఁ
జేరెను సుభద్ర కడువేగ చెలువమలర. 240

వ. మఱియు సకలభూషణాలంకృతలైనదనసఖీజనంబులు భయపార్శ్వంబులం గొలువఁ గ్వణత్కనకకంకణోజ్జ్వల బాహువల్లికల గంగాతరంగోపమానచామరంబులువీవ, నవయౌవనశోభితలలనాలలామలు మృగమదకర్పూర ద్విగుణీకృత ప్రముఖ కలితహస్తాబ్జాంగుష్ఠ నిశితనఖాగ్ర చ్ఛేదితారుణ నాగవల్లీదళ మూలమృదుపూగ వర్ణమౌక్తిక చూర్ణసంయుక్త తాంబూలంబులియ్య, మఱికొందఱు రాజబింబాస్యలు భాసుర నవరత్నకలిత సౌవర్ణదండంబులఁ బరాబరిసేయ, నొక్క కీరవాణి హెచ్చరికలు దెలుప, నొక్క గంధగజయాన భాసురరత్న పరిశోభిత కరయుగంబుఁ గైదండలీయ, హీరమణిఖచిత సౌవర్ణ పాదుక లొకకోమలి మృదుపాదాబ్జంబులఁ దొడుగ మంద గమనంబుననున్నత కఠినచారుకుచకుంభభారంబున లేనడుమసియాడుచుండ, మాణిక్య తాటంకంబులు చెక్కుటద్దంబులపై నటింప, చారుశోభితారుణాధర బింబఫలాపేక్ష సాచీకృత తుండకీరంబు హస్తాగ్రభాగంబునఁ జెన్నొందుచుండ, వికసిత వదనారవిందంబున నమరు నయనేందీవరంబులపై నళినీలాలకంబులు చెదరిన, నఖపాలిం దువ్వుచు, గమనాయాసజనిత స్వేదకలనప్రస్త కస్తూరీతిలకంబుఁ గొనవ్రేళఁ దిద్దుచు, మెఱుఁగు పసిండికుండలచ్ఛాయ విడంబించు పాలిండ్లజాఱిన కొంగు చెఱంగుఁ బెడకేల సవరించుచు, సునాసీరోపల జీమూతనిశాశైవలవేణిజఘనంబుల నటింప, నవరత్నఖచితమంజుల మంజీరంబులు పాదాగ్రంబున ఘల్లుఘల్లున మ్రోయుచుండ వెన్నుని

ముద్దుచెల్లెలు చెలులతోడఁగూడి తనవిభుం జేరంజని, కనక
పాదుకలూడ్చి, ప్రాణవల్లభు పాదంబుల విన్యస్తపద్మాననయై
లేచి ముకుళితకరకమలయయిన భార్యామణిం జూచి
యింద్రసుతుం డి ట్లనియె. 241

తే. దేవకీదేవికిని వసుదేవునకును
సీరపాణికి యాదవశేఖరునకు
నతని నారీమణులకును హితులకెల్ల
క్షేమమేకద నేఁటికిఁ జెలియ! చెపుమ. 242

వ. అనిన సుభద్ర యి ట్లనియె. 243

క. మీరడిగిన వారెల్ల న
పారైశ్వర్యములుగల్గి ప్రమదముతోడన్
ద్వారక నతి సుఖులై యు
న్నారొక్కటఁ గొదువలేదు నగసమధైర్యా! 244

వ. అని విన్నవించి ముకుళితకరకమలయై సవినయంబుగా
మఱియు ని ట్లనియె. 245

ఉ. శాంతుఁడు భక్తవత్సలుఁడు సారసనేత్రుఁడు ధీరుఁడున్
రమా, కాంతుఁడు తార్క్ష్యకేతనుఁడు కంజభవార్చితపాద
పద్ముఁడున్, దంతికులేంద్రరక్షకుఁడు దైవము కృష్ణుఁడు
నన్నుఁబిల్చి నీ, చెంతకుఁబంపినాఁడు గుణశేఖర! చెప్పెదఁ
జిత్తగింపుమా. 246

క. నరునకు నీనేర్పునన్
పరుషోక్తులఁ దెలియఁజెప్పి పాపాత్ముగయున్

బరువడి దెమ్మన వచ్చితి
నరిమర్దన యనుపువాని నతివేగమునన్. 247

మ. వినుశక్రాత్మజ! రుక్మిణీధవునితో ద్వేషంబు నీకేల నా,
వనజాతాయతలోచనుండు కరుణా వారాశియై మిమ్ము ల
ర్లన్, ఘనులన్ జేయుట నీవెఱుంగుదు గదా! గంధర్వునిం
బంపుమా, యనుమానింపక కృష్ణుపాలి కిపుడే యత్యంత
మోదంబునన్. 248

సీ. పుండరీకాక్షుండు పోరాని బందుగు
ప్రాణాస్పదుఁడు నీకుఁ బ్రాణనాథ!
ఆపదబ్ధిఁదరింప నక్షయమగునావ
చెలువుఁడు నీబావ జీవితేశ!
కలనైన మఱువఁడు కరుణాకటాక్షంబు
నీమీఁద స్నేహంబు నెఱపుచుండు
నతనిచెంతనునీవె యఖిలారి వీరుల
సమయంగఁజేసితి సాహసమున

తే. పెరటిచెట్టైట్టులుండును బృథ్విలోన
నేరికైనఁ జులకనఁగా దెంచిచూడ
నెక్కుడిగయుండ దేయూర దేదిత్రోవ
యింతచలమేల వలదయ్య యింద్రతనయ! 249

సీ. వినుముపాలిండ్లను విషమూని యేతెంచి
చన్నిచ్చుపూతన సమయఁజేసి
బలువేగమునవచ్చు బండిరక్కసుఁబట్టి
మించువేగమున ఖండించివైచి

యవనిఁదృణావర్తు నట్టిట్టుపోనీక
సాహసంబునఁబట్టి చంపివైచి
తల్లిరోటనుగట్ట దర్పంబుతోడుత
బలుమద్దిచెట్టుల నిలనుగూల్చి
తే. కినిసి కాళింగు గర్వంబు గీటడంచి
ధేనుకాసురచాణూర తేజమణఁచి
యట్టి కంసునిమాయలు మట్టుపఱచి
బాలలీలల విహరించెఁ బ్రబలుఁ డగుచు. 250

మ. కరుణాసాగరుఁ డార్తపోషకుఁడు దక్షధ్వంసిమిత్రుండు
భా, స్కరచంద్రాక్షుఁడు శత్రుసంహారుఁడు శక్రస్తోత్ర
పాత్రుండుభా, సురనీలాభ్రశరీరుఁ డచ్యుతుఁడు విష్ణుండ
వ్యయుం డీశుఁ డీ, ధరణీభారము మాన్పఁగావెలసెనే త
న్మాత్రుఁడేచూడఁగన్. 251

ఆ. బావమఱఁదులకును బద్ధవైరంబులు
గోత్రజులకునెల్ల మైత్రిగుణము
గలుగదండ్రు బుధులు కలలోన నైననీ
కింతచలముతగునె యింద్రతనయ. 252

క. మీదాయాదులె యీసం
వాదంబును విన్నవెన్క వారిమనములన్
మోదం బేమనవచ్చును
మీఁదట వివరంబెఱుంగ మీలో మీకున్. 253

క. కౌరవపతికిన్ మీకును
నారనివైరంబుపొసఁగు నది యడఁగుటకై

ధీరుని గృష్ణునిఁ గొనవే
వారలఁ గెలువంగ లేవు వాసవతనయా! 254

సీ. శ్రుతులబ్జభవునకు సొంపుతోడుత నిచ్చె
సుధ నిర్జరులకిచ్చె సొబగుమీర
భూమినిబోకుండ పాసగంగ నిల్పెను
రాక్షసబాలుని రమణఁగాచె
నిలనుమూఁడడుగుల నెలమితోడుతఁ దెచ్చె
క్షత్రియకోటుల సమయఁజేసె
భవునిచాపముఁద్రుంచె బలభద్రుఁడై మించె
ధరణిబుద్ధుండు నై తనరుమిగుల
ఆ. నసురపతులఁగూల్చి యమరులరక్షించెఁ
బెక్కురక్కసులను పీఁచమణఁచె
ద్రుపదపుత్రిసిగ్గు తొలఁగకుండనుగాచె
నింతమహిమనీకు నేది? చెపుమ! 255

తే. శౌరి ననుఁజూచి నినుఁగాచె సవ్యసాచి
యతనిదృష్టికి నీవెంత యరసిచూడఁ
గులిశధారకు నోపునే కుధరచయము
సింహమెదుటను నిల్చునే సింధురంబు. 256

సీ. నామాట వినవయ్య నాప్రాణనాయక!
కోపంబు వలదయ్య గుణగణాఢ్య!
వారితో మిత్రుఁడై రారాజుపోరిన
రణముసేయఁగలేవు రయముతోడ

గయునిరక్షించినఁ గావఁడు కురువీర
చలితకల్మషవృత్తి వలనఁజేసి
ధర్మపరులుమీరు దారుణాటవిలోన
మెలఁగుచు నున్నారు ఫలములేక
తే. జలజనేత్రుండు వారల గలిసినవగు
గోరుచుట్టుపై రోకటఁ గ్రుమ్మినట్లు
వలదుహరితోడ వైరంబు చెలఁగి మైత్రి
చేయశాత్రవ నాశంబుఁ జేకురుసుము. 257

క. నావచనము విని గయునిఁ
భావజగురు కడకుఁబంపు బహుమోదముతో
నీవాఁడై కృష్ణుండీ
భూవలయము మీకొసంగు భూరివివేకా! 258

సీ. తనయింట పాయస మనువొందగానుండఁ
బొరుగింట బిచ్చంబుఁ బొందునట్లు
కల్పవృక్షఫలంబు గరమర్థి వదలివే
జీడిపండునకు నాశించినట్లు
కామధేనువు పాఁడి కడఁజేసి యటపోయి
మేకపాఁడికిరాను మెలఁగినట్లు
బుధులతో స్నేహంబు పొందుగాదనివీడి
క్రూరచిత్తుల పొందు గోరినట్లు
తే. కలితచింతామణి విడిచి గవ్వగొనెడి
గతిని రాధికాభర్తసంగతిని విడిచి

గయునిఁ గైకొనఁ దగునయ్య యతిబలాఢ్య!
చిత్తమున నెన్ను మీనుడి జీవితేశ! 259

ఆ. పద్మనాభు భజన పరిహరించిన వాఁడు
జయము నెందుఁ గొనఁడు సత్యమరయ
హరిని నమ్మువాని కాపదల్ పొరయవు
గయునివిడిచి మనుట కరములెస్స. 260

క. హరితోడఁ బోరి బ్రతికిన
నరపతులును విబుధయక్ష నాథులు గలరా!
పరికించి చూడుమిలలో
ధరణీధరవైరి తనయ తడయకనుపుమా. 261

ఆ. ఇంటిదీపమనుచు నెరసిన ప్రేమతో
ముద్దులాడవాని మూతిగాలు
మేనబావ యనుచు మెండొడ్డి యున్నావు
గయుని నియ్యకున్నఁ గావఁ డతఁడు. 262

ఆ. ఆఁడుదాని మాట పాడిగాదనుచు నీ
వాడవలదుసుమ్మి యముల చరిత!
గయునికొఱకు నీవు కంసారితోడను
బోరిజయము గొనవు పుణ్యచరిత! 263

తే. పాండుభూపాలు సంతతి పరఁగనిపుడు
నెగడనియ్యవు గాఁబోలు జగతిలోన
హరికిఁ బగవాఁడవై తివే నతఁడు మిమ్ముఁ
బ్రాణములతోడఁ బోనీఁడు ప్రధనమునను. 264

క. అని నాలుగుపాయంబులఁ
దనవిభునకుఁ దెలియఁజెప్పఁ దద్దయు వేడ్కన్
వనితారత్నముఁ గనుఁగొని
యనిమిషపతి సుతుఁడుపల్కె నంగనతోడన్. 265

తే. తరుణి నీమాట లెల్లను దథ్యమరయ
హరికిఁగయుఁ దెగ్గు చేయుట నదియెయుంగఁ
బ్రాణభయమున వచ్చితిఁ బాండుతనయ!
యభయ మిమ్మనివేఁడిన నభయ మిడితి. 266

ఆ. గొల్లదొడ్డె నున్న గోవును పట్టిచ్చు
టంతకన్న హాని యవని గలదె
యేమిసేతు నింక నేలాగు బొంకుదు
మించియభయ విడితి చంచలాక్షి! 267

మ. ఘనుఁడా కృష్ణుఁడు దుష్టసంహరుఁడు శక్రస్తోత్రపాత్రుం
డు జీ, వనజాతాయత పత్రనేత్రుఁడువిప ద్వారాశి కౌర్వా
నలుం, డనఘుండాఢ్యుఁడు భక్తపోషకుఁడు బ్రహ్మాదిత్వ
సంసేవ్యుఁడౌ, దనుజధ్వంసిని మార్కొనంగవశమా తన్వీ
శిరో రత్నమా! 268

సీ. పద్మాక్షుతోఁ బోర భావ్యంబు గాదని
గయునెట్లు పట్టిత్తుఁ గ్రమము తప్పి
నమ్మించి చెఱచెను నరుఁడెంత ద్రోహియో
యనినను రోయరే యవనిజనులు
ప్రాయిఁబోనాడినేఁ బట్టియ్యఁగా రాద
దిచ్చిన బాపం బదేలదప్పు

నీమాట శాత్రవు లేపాటి విన్నను
హింసింప కుందురే యీక్షణంబ
తే. ఇంతకార్యంబు గలుగుట యేనెఱుంగ
జంకు మదిగొని గంధర్వ శౌరికీయఁ
బలికిబొంకను భాలాక్షు పాదమాన
తెలుపు మీమాట శౌరితోఁ దేటపడఁగ. 269

ఉ. శ్రీపతి లోకరక్షకుఁడు జీవనతప్తహిమాంశు నేత్రుఁడుఙ్
బాపసయజ్ఞపోషకుఁడు దర్పకవైరిమదేభసింహుఁడుఙ్
బాపవిదూరుఁ డచ్యుతుఁడు పన్నగశేఖరతల్పుఁ డీశుఁడుఙ్
గోపవధూమనోహరుఁడు కోమలి! యాతని నెన్నశక్యమే?

ఆ. అతనికన్నఘనులు క్షితిని జూచిన లేరు
సములు లే రతనికి జగతిలోన
నతఁడు లోకవంద్యుఁ డక్షీణ శౌర్యుఁడా
నతని గెలువఁగలఁడె యబల! హరుఁడు. 271

సీ. నామాట మదినుంచు నలినాక్షి! చెప్పెద
భయమంది విడువను గయుని నేను
గంసారితోఁ బోరి కడతేర్చి వచ్చినఁ
గలుగును గీర్తి లే క్ష్మాతలమున
నతనిచే నీల్గిన నప్పుడ కైలాస
పదవిచక్కఁగఁగల్గు ముదముతోడ
శరణుఁ జొచ్చినవారి శత్రుల కిచ్చుట
క్షత్రియ ధర్మమే జగతిలోన

తే. భోగినాయకుఁ డుండఁడే పొట్టనిండ
గాలిమెక్కిన మిక్కిలి గౌరవమున
వానినుండి కాఁగలదేమి వసుధలోన
ననిన నర్జునుఁ గనుఁగొని యబల యనియె. 272

సీ. అనలంబు చేరువ వనజంబు నిల్చునే
హరిచెంత నిల్చునే కరివరంబు?
గరుడుని చెంగట నురగంబు నిల్చునే?
తిమిరంబు నిల్చునే ద్యుమణి యొద్ద?
గోత్రంబు నిల్చునే కులిశంబు పెట్టునఁ
గాకంబు నిల్చునే కేకిపజ్జ?
బడబానలంబందుఁ బాథోధి యింక దే?
యావులు నిల్చునే వ్యాఘ్రముకడ

తే. నెదుటిబలమును నీబల మెఱుఁగకీవె
యింతచలమును బూనితి విచ్చిగయుని
రుక్మిణీపతి నీవును రూఢిమెఱయ
నేకమై ధరనెల్లను నేలుమెలమి. 273

వ. అనిన విని సునాసీరసూనుండు కించిత్కోపంబున మురారి సహోదరిం గాంచి యి ట్లనియె. 274

తే. తమ్మిచూలియుఁ జేజేలు తగిలినడువఁ
గొండరాచూలి పెనిమిటి కుధరవైరి
యిచటకే తేర భయమంది యీయగయుని
పట్టియడియాస నీకేల వలదు పొమ్ము 275

తే. చాలు నీరాయబారంబు సరసమాయెఁ
బెక్కుసుద్దులు చాలింపు ప్రేలకిపుడు
పొమ్మునీమాట వినుటకుఁ బొసఁగదింక
ననినఁ గవ్వడి వీక్షించి యబల యనియె. 276

వ. వినుము మహానుభావా! సర్వంబు నీకు విన్నవించితి, కోపం బుపశమింపుము. సర్వజ్ఞుండవు నీ వెఱుంగని నీతి యుం గలదె మీరును కృష్ణుండు నిరువురు నరనారాయణులరు భూభారంబు మాన్ప నవతరించినారు. దుష్టనిగ్రహశిష్టపరిపాలనంబునకుం గర్తలు. కృష్ణుండు నీవనియెడి భేదంబు లేదు. ఈదుష్టవర్తనుం డైనగయుండు హరి కెగ్గు చేయుటకాదె నింతయయ్యె. మహానుభావా! యనిన నతివనవలోకించి మందస్మిత సుందరవదనారవిందుం డగుచు నింద్రజుం డి ట్లనియె. 277

మ. హిమగోత్రాత్మజ వల్లభుండుహరితో నేతెంచి వారిర్వ్వరా
యమరానీకము తోడఁగూడి బలదైత్యధ్వంసి తావచ్చినన్
సమరోర్విన్ వెనుదీసి పోదురుసుమీ చంద్రాస్య! యీ
మాటకుం, బ్రమథాధీశుఁడుసాక్షి మాధవునకున్ బట్టీయ
గంధర్వునిన్. 278

వ. అనిన విని దేవకీతనయ తన ప్రాణవల్లభుని పాదంబులకు నమస్కరించి పోయివచ్చెద జగద్గురుం డైనశ్రీకృష్ణున కేమని విన్నవింతు నానతిమ్మనిన వాస్తోష్పతి నందనుం డి ట్లనియె. 279

తే. విన్నవింపుము మనవిని వివరముగను
గయునిఁ గరుణారసంబునఁ గావుమనియు
దనదుప్రాపున నున్నాఁడు వనములోన
ననియు శ్రీకృష్ణునకుఁదెల్పు మబ్జవదన! 280

వ. తదనంతరంబ సుభద్ర పతి యనుజ్ఞవడసి బంగారుపల్లకి
నెక్కి సఖీజనంబులు గొల్వ వెన్నుని కడకేగి హరిపదకమ
లంబులకు మ్రొక్కి ముకుళితకరకమలయై యి ట్లని
స్తుతించె. 281

ధృతివిలోచనము. నళినలోచన! నారదసన్నుత!
జలజభూనుత ! శక్రసురార్చిత !
కలుషసంహార ! ఖండితదానవ !
బలవిభేధన! పాలన! కేశవ ! 282

వ. అని స్తుతియించి. 283

ఉ. వారిజనాభ! నీవనుప వాసవనందనుఁ డున్న చోటికిన్
జేరి హిమాద్రిధైర్యునకుఁ జెప్పితిబుద్ధులు పెక్కురీతులన్
భూరిదయాబ్ధి! యాఘనుని బుద్ధికి నేవిధినెంచిచూడ నీ
ధారణిఁబాండుసూనులకు దాపునునండయు నీవెకాహరీ!

ఆ. ప్రాణమైననిత్తుఁ బద్మాక్షునకు నేఁడు
గయుని నియ్యనేను గ్రమముదప్పి
యనుచు ప్రతినచేసి యచలత నున్నాఁడు
చలముగల్గి యతఁడు చక్రహస్త! 285

తే. అతనికీర్తియు నీకీర్తి యరసిచూడ
నతనిప్రతినయె చెల్లింపు మనఘచరిత

యతఁడు నీముద్దు మఱఁదెకా యంబుజాక్ష!
పట్టిపాలార్పఁ దగునయ్య పరమపురుష! 286

సీ. నీదయారసముచే నీలకంఠునిచేతఁ
బాశుపతము దెచ్చెఁ బరమపురుష!
నీకృపాదృష్టిచే నిఖిలలోకములందు
జయము చేకొనెనయ్య చక్రహస్త!
నీమహామహిమను భూమీశ్వరులచేతఁ
గప్పముల్ గైకొనెఁ గమలనాభ!
నీత్రాణచేతనే నిర్జరేంద్రునివనం
బగ్ని కాహుతిఁజేసె నంబుజాక్ష!
తే. కమలగంధర్వు లనుగెల్చె సదయహృదయ!
చిత్రరథుగెల్చె శుభ్రాంశు మిత్రనేత్ర!
భూరిశస్త్రాస్త్ర కుశలుండు భువనవంద్య
యింద్రసుతుఁడు సామాన్యుఁడే! యిందిరేశ! 287

సీ. పార్థుండు శస్త్రాస్త్ర పాణియై నిల్చిన
బ్రహ్మాదిసురలకు భయముపుట్టుఁ
గదనభూమిని నున్న గడగడ వణఁకుచు
శరణని వచ్చును శత్రుసమితి
యెదిరించి వచ్చిన మదమణఁగించును
గరుడగంధర్వాది ఘనులనైన
శివుని మెప్పించెను సిద్ధసాధ్యుల నెల్ల
నవలీలగెల్చె క్షణాంతరమున

తే. యాదవులఁ గెల్చి నన్నుఁ గొనె మోదమలర
బలము ధైర్యంబు శౌర్యంబు పౌరుషంబు
సత్యశీలంబు స్థైర్యంబు సాహసంబు
చెల్లునతనికి నీసుండి శేషశయన! 288

క. ధారణిలో నర్జునుఁడను
భూరుహమును బెంచినావు భూమిని విలస
త్కారుణ్యామృతరసమున
నారాయణ! తునిమివైవ న్యాయమెదానిన్ ? 289

వ. అనిన సహోదరింజూచి హరి యి ట్లనియె. 290

తే. చాలునోయమ్మ! నీపతి సాహసంబ
దెంతసెప్పెద విక్కడ వింతగాను
నయభయమ్ముల నొకకొన్ని యగ్గలించి
ధవుని ప్రతినయ చెల్లింపఁ దలఁచినావు. 291

ఆ. మగలమీఁదఁ బ్రేమ మగువల కెల్లను
గలిగియుండు నిజము కల్లగాదు
తల్లిదండ్రి యన్న దమ్ముల మీఁదను
మెండుకూర్మి లేదు మెలఁతలకును. 292

సీ. నినుఁజూచి తాళితి నెనరున నిందాఁక
నీచక్రధారచే నింద్రతనయు
తలఁద్రుంచివైతు నీధరణీతలంబునఁ
బావకునకు నెంత పరఁగఁద్రుణముఁ?

బడబానలమునకుఁ బ్రాలేయ కణమెంత?
కులిశాయుధునకును గుధరమెంత?
కంఠీరవమునకు గంధేభ మదియెంత?
గౌరీశు దృష్టికిఁ గాముఁడెంత?
తే. తన ప్రతినయెంత తానెంత? తనదు శౌర్య
సాహసములెంత? బలమది దలఁపనెంత?
నాకుఁ దనకును రణమగు నలిననేత్ర.
చింతనీకేల శుద్ధాంత సీమకరుగు. 293

వ. అనిన సుభద్ర సఖీజనంబులతో నంతఃపురికరిగెఁ దదనంతరంబ. 294

తే. సత్యసంధుండు ధీరుండు సాహసుండు
నియమపాలన సుగుణుండు నిర్మలుండు
పుణ్యచరితుండు సద్బంధు పోషకుండు
నైనసాత్యకి హరిఁగని యనియె నపుడు. 295

క. ఓయదువంశోత్తమ నా
రాయణ వైకుంఠవాస రవిశశినయనా
న్యాయైకపాల విజయుని
న్యాయమె తెగఁజూడమీకు నపకీర్తి సుమీ. 296

సీ. పద్మాక్ష వినవయ్య పాండుకుమారులు
నెనరైన బంధులు మనకువారు
వారలలోపల వాసవాత్మజు నీవు
పెంచితి మిక్కిలి ప్రేమమలర

మేనత్త తనయుండు మేనమఱందియు
మనసుభద్రకుఁబతి యనఘ బలుఁడు
గౌరీశు మించెను గార్ముక విద్యచేఁ
గలహంబు భావ్యమే కదిసి యిపుడు

ఆ. చంపరాని పగను సాధింపగా రాదు
నీకుఁ దెలియనట్టి నీతిగలదె
యతఁడు మూర్ఖుఁడైన నాతని ప్రతినను
దీర్పుమనిన ననియె దివిజసుతుఁడు. 297

మ. సమరోల్లాసుఁడు శత్రుసంహరుఁడు భాస్వచ్చాపశస్త్రాస్త్రుఁ
డుఁ, బ్రమథాధీశుఁడు మెచ్చఁబోరు ఘనుఁడుఁ బాథోధి
గంభీరుఁడుఁ, విమలాంభోధి సుధాంసుహారయశుఁడుఁ
వీరాహినాగారి యా, యమరేంద్రాత్మజు గెల్వలేరు
త్రిదశేంద్రాదుల్ మఱిఁ వచ్చినన్. 298

తే. ఇంతవాఁడని యెఱుగుదు నింద్రసుతుని
నేఁడు ప్రతినయు విడుచుట నీతికాదు
పార్థునని గెల్చి గంధర్వుఁ బట్టితెత్తు
నఖిలయాదవులను గూర్చు మతిరయమున. 299

క. అని కృష్ణుఁ డానతిచ్చిన
విని సాత్యకి సైనికులను వీరులనెల్లఁ
గనుఁగొని వారలకెల్లను
వనజోదరుఁ డాడినట్టి వచనము వేర్మిన్. 300

వ. అప్పు డెఱింగింప నయ్యాదువృష్ణిభోజాంధకవీరవరులు పాశ,
తోమర, భిండివాల, పట్టిస, గదా, కుంత, పరిఘు, కణయ,

చక్ర, ముద్గర, కంపణ, శూల, ధనుర్విశిఖ, పరశు, ఖడ్గ, కరవాల, ముసలాదిభద్రాయుధపాణులై నడువ గంధసింధురంబులు, మరు ద్వేగ స మా నహయసముదయంబులు, ఘనరథబృందంబులతోఁ గూడి లెక్కకు మిక్కుటం బైన మహాయోధవరులు యుద్ధసన్నద్ధులై యుండిరని చెప్పిన.

క. హరిపదసేవాసక్తులు
పరమమునులు సూతుఁజూచి బహుమోదముతోఁ
బరికింపఁగ నెట్లయ్యెను
తరువాతి కథావిధులను దడయక చెపుమా. 302

ఉ. నరసింహాచ్యుత కృష్ణ కేశవహరీ నారాయణానంత భా
సురనీలాంబుద చారుగాత్ర సుగుణా శుభ్రాంశుకోటిప్రభా
యరవిందాక్ష సురాధినాథ వినుతా యక్షీణశౌర్యోన్నతా
స్థిర కారుణ్యపయోనిధీ శుభకరా శ్రీగారుడాధీశ్వరా.

క. సలలిత సారసుధాకర
సలిలధరశ్యామగాత్ర సారసనేత్రా
నలినభవ సన్నుతయహో
బిళగిరి వరమందిరేశ భీమస్తుత్యా. 304

తోటకవృత్తము. కమలారమణీనుత కంసహరా!
యమరార్చిత పాదయుగాద్రిధరా!
విమలాంబుజలోచన విశ్వపతీ!
సమరాహత దానవ చక్రధరా. 305

మాలిని. సరసిజదళనేత్రా సామజస్తోత్రపాత్రా
నిరుపమహారమిత్రా నీరదస్తోమగాత్రా

నరమృగవరరూపా నాగరాజైకతల్పా
వరగరుడగిరీశా వారిజాప్తప్రకాశా. 306

గద్య. ఇది శ్రీమదహోబళేశ్వర కరుణాకటాక్షవీక్షణ ప్రవర్ధమానవైభవ తిమ్మనమంత్రితనూభవ సరససాహిత్య రామనామాత్యప్రణీతం బైనకృష్ణార్జునసంవాదం బనునామాంతరంబుగల గదోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీ ర స్తు.

# గ యో పా ఖ్యా న ము

## ద్వి తీ యా శ్వా స ము.



క. కామినీమనోహర!
శ్రీకంఠసతీసుతాఖ్య! శ్రితజనపోషా!
రాకేందు తరణిలోచన!
శ్రీకరనరసింహశైల! శ్రీ నరసింహా! 1

వ. అవధరింపుము శౌనకాదిమహామునీంద్రులకు సూతుండు పరమహర్ష సమేతుం డై చెప్పె నట్లు కృష్ణార్జునులయుద్ధ సమయంబున. 2

సీ. నిరుపమతపనీయ నిర్మితభవనముల్
తోయధిగంభీర ఖేయములును
జైవాతృకామల చారుసౌధంబులు
మగరాల నమరిన మండపములు
సకలసంపదలతో సంతుష్టులై యున్న
సజ్జనగృహమేధి సంఘములును
ద్విజరాజరాజన్య వివిధవైశ్యోత్తముల్
మఱియు నాలవజాతి మనుజతతియు

తే. గంధసింధురగణములు గంధవాహ
జవసమేతమహావాజి సముదయములు
కాంచనస్యందనములును గలిగియొప్పు
హస్తినాపురవైభవం బవనిలోన. 3

క. అనగరమేలు ధీరుఁడు
భూనాయకశేఖరుండు పుణ్యుండును సు
జ్ఞానియు ధృతరాష్ట్రాఖ్యుఁడు
భానుప్రభుఁ డగుచు వెలయు బంధురకీర్తిన్. 4

వ. ఆరాజశేఖరుం డొక్కనాఁడు సకలభూషణాలంకృతుం డై కాంచనరత్నఖచితసింహాసనాసీనుం డై ప్రమోదచిత్తుం డగుచుఁ గృపద్రోణాచార్యభీష్మాదిసభాసదులును, దుర్యోధనాదికుమారవర్గంబును వీరభటసమూహంబులునుగొల్వఁ గొలువున్న సమయంబున. 5

సీ. ఘనసారశరదిందు కమనీయతనుకాంతి
దిక్కుల నెల్లను బిక్కటిల్ల
రహివుట్ట సప్తస్వరములరాల్ గరగించు
మహతియు దనచేత నమరుచుండ
నిర్జరవాహినీ నీరముల్ నించిన
జలపాత్ర కరమునఁ జెలఁగుచుండ
నష్టాక్షరీమంత్ర మాత్మలో నెన్నుచు
నక్షమాలిక కేల నమరుచుండ

తే. సత్యవచనుండు మునివంశచక్రవర్తి
నలినసంభవసూనుండు నారదుండు

చేదలుమార్గాన కలహభోజనుఁడువచ్చె
రాజశేఖరుఁ డగుధృతరాష్ట్రకడకు. 6

వ. ఇట్లు వచ్చిన నారదమునీంద్రునకు సవినయంబుగా విధ్యుక్త ప్రకారంబున నాసనార్ఘ్యాదులొసంగ సుఖాసీనుం డై యమ్మహాముని విచిత్రవీర్యాత్మజున కిట్లనియె. 7

సీ. ఏరాజునకుఁగల రిట్టి తనూభవు
లసహాయశూరులు నమితబలులు
ఏరాజునకుగల వెన్న శక్యముగాని
సమరవీరభటాది సముదయములు
ఏరాజునకుఁగల రీమంత్రిసామంతు
లమరగురుసమాను లధికయశులు
ఏరాజునకుఁగల రీధనురాచార్య
రాధేయ భీష్మాది రథికవరులు

తే. వినుము కౌరవరాజేంద్ర విమలచరిత
ముఖ్యవిభవంబు చేకొంటి మోదమలర
నేఁడు నేత్రోత్సవం బయ్యె నృపవరేణ్య
సరసగుణధామ ధృతరాష్ట్ర సార్వభౌమ. 8

తే. వినుము ధృతరాష్ట్ర రాజేంద్ర విమలచరిత
పాండుపుత్త్రుల గయునికై భండనమునఁ
గూల్చ యాదవసేనలఁ గూర్చె శౌరి
యుద్ధమాన్పంగ శక్యమే యెరికైన. 9

వ. అనిన సురమునికి ధృతరాష్ట్ర ధరారమణుం డిట్లనియె. 10

క. శ్రీకృష్ణ ధనంజయులకుఁ
ప్రాకటముగ భేదమెట్లు ప్రాప్తంబయ్యెన్
ఈకార్యమెల్లనిజముగ
నాకు నెఱింగింపు విందు నారదమౌనీ. 11

వ. అనిన నారదమునీంద్రుం డి ట్లనియె. 12

ఉ. పారసనాథుఁడల్గి గయుఁ జంపెద నంచుఁ బ్రతిజ్ఞ చేసినన్
భూరిభయాతురుండగుచు భూవర వచ్చిసురేంద్రసూతినిం
జేరి భయంబుఁ బాపి నృపశేఖర కావు మటన్నఁగాచినన్
ధారణిఁగృష్ణజిష్ణులకుఁ దద్దయువైరము గల్గెనేటికిన్. 13

క. కావున మీరు సహాయము
పోవలయు ధనంజయునకు భూరిబలంబుల్
వేవేగఁగూర్చి పనుపుము
భూవర యనిచెప్పిమౌని పుంగవుఁ డరిగెన్. 14

వ. అంత విచిత్రవీర్యాత్మజుం డమ్మునిమాటల కరుదంది
భీష్మాదియోధాగ్రేసరుల వేర్వేఱఁ బిలిపించి యి ట్లనియె.

సీ. సురముని మాటలు చోద్యమై యున్నవి
వింటిరే మీరెల్ల విశదముగను
వసుదేవ సుతునకు వాసవాత్మజునకుఁ
గలహంబు గలిగెను దలఁపనరుదు
అనవుడు ధృతరాష్ట్రుఁ గనుఁగొని మందాకి
నీసుతుఁ డప్పుడు నేర్పుతోడ
నరనాధ మృషగాదు నారదువాక్యంబు
సందియం బేటికి సచ్చరిత్ర

తే. అది నిజంబని యెన్నుమా మదిని భూప
దైవయత్నంబు దప్పునే ధాత కైనఁ
గాన మీరు సహాయంబు గాఁ జనఁదగు
శ్వేతవాహనునకు వేగ భూతలేశ. 16

తే. చిత్రవాహను చేతికిఁ జిక్కియున్న
యపుడె గంధర్వవరు గెల్చి యాహవమున
నీకుమారుని విడిపించె నిముసమునను
వారు నీకును బగవారుగారు సుమ్ము. 17

వ. కావున నర్జునునకు సహాయంబు గావలయునని భీష్మాదులు
ధృతరాష్ట్రమహీశునకుం జెప్పిన నతండును సమ్మోద
చిత్తుండై యాపగాతనయాదియోధాగ్రేసరులకు దుర్యో
ధనాదిపుత్త్రశతంబునకు సెలవిచ్చిన తదనంతరంబ. 18

సీ. మీసముల్ ద్రేళ్లన మెల్లన దీఁటుచు
నయ మొప్పఁ జిఱునవ్వు నవ్వి నేఁడు
తలఁచిన పనులెల్ల తనుదానె ఫలియించె
నెదురు నా కెవ్వరు వెదకిచూడఁ
బాండవేయులు నేను బఱఁగంగ నొక్కటై
యచ్యుతు నణఁగింతు నాహవమున
గూల్చెదఁ బిమ్మటఁ గుంతీతనూజుల
నటమీఁదఁ గొనియెద నవనియెల్ల

తే. శంక యొక్కింతయును లేక శాశ్వతముగ
నుర్వి నేలెద ననిమది నూహచేసి

ద్రోణభీష్మాది యోధుల తోడఁగూడి
యాసుయోధనుఁడాస్థాన మపుడు వెడలె. 19

వ. మఱియు భీష్మద్రోణకృపాచార్యాదియోధాగ్రేసరులును, గర్ణశకునులును, సహోదరులును, మగధ, మళయాళ, బర్బర, కురు, కళింగ, త్రిగర్త, కొంకణ, ఘంకట, కోసల, కరూశ, శూరసేన, సుధేష్ణ, సాళ్వ, యవన, యుగంధరాంధ్ర, సౌరాష్ట్ర, పాండ్య, పుళింద, చోళ, చేది, మరాట, మహారాష్ట్ర, ·గౌ, ళాంగ, వంగ, కర్నాట, దాశార్ణ, ద్రవిడ, విదర్భ, విదేహ, విరాట, కరహాట, చోళబాహ్లిక, బహుదాన, కిరాతక, కేకయా, వంతికా, కుంతల, ఘూర్జర, కేరళ, కాంభోజ, గాంధార, కాశ్మీరాదులగు ఛప్పన్న దేశాధీశ్వరులును దోడనడువ కాహళ శంఖాదిరవంబులు బిట్టు మ్రోయుచుండ వేదండపురంబు వెడలె నంత. 20

సీ. చిలుకతెక్కలచాయ గలిగిన యశ్వముల్
సకలాస్త్రవరవస్త్ర సంఘములును
గంధవాహాశన ఘనపతాకంబును
గల్గినమహనీయ కనకరథము
సారథి దెచ్చిన సరవితోడుత నెక్కి
ప్రథమాద్రిపైనున్న భానుఁ డనఁగఁ
దమ్ములు కోదండ ధారులై వేడుకఁ
దనవెనువెంటను దగిలి రాఁగ

తే. ద్రోణ గాంగేయ ముఖ్యులుఁ దోడనడువ
సమరవిజయుండు నత్యంత సాహసుండు
రమణఁజేరెను ద్వైతవనమును వేగ
రాజరాజగు ధృతరాష్ట్రరాజసుతుఁడు. 21

క. రారాజు వచ్చెనని దమ
వారలు విన్నపముసేయ వడిధర్మజుఁడున్
మారుతియున్ మాద్రేయులుఁ
గౌరవపతి కెదురుచనిరి గౌరవమలరన్. 22

తే. పాండవాగ్రజు శ్రీపాదపద్మములకు
వందనము చేసె ధృతరాష్ట్రనందనుండు
ధర్మతనయుండు రారాజు పేర్మితోడ
కౌఁగిటను జేర్చె సంతోష కలితుఁ డగుచు. 23

వ. తక్కినపాండవులందఱుఁ దమతమ తారతమ్యంబు లెఱింగి
వందనాలింగనముల సలిపి రప్పుడు. 24

క. సుర నిమ్నగాత్మజునకున్
గురునకు ధర్మజుఁడు మ్రొక్కి కురుపతితోడన్
వరసింహాసనముల పైఁ
బరువడిఁ గూర్చుండిరపుడు ప్రమదంబలరన్. 25

వ. గురుకృపాశ్వత్థామ భీష్మధృతరాష్ట్రానుజులును భీమార్జున
నకుల సహదేవులును సకలదేశాధీశ్వరులంగూడి వాస్తో
ష్పతిచందంబున వెలుంగుచుఁ గుంతీకుమారాగ్రణి గాం
ధారి సుతాగ్రణి కిట్లనియె. 26

క. ధృతరాష్ట్రి నతనిసతికిని
సతతము బ్రాహ్మణులకచటి సజ్జనతతికా
శ్రితులకు బాంధవకోటికి
నతిశయ సంతోషమేకదా మానధనా! 27

క. అని ధర్మతనయుఁ డాడిన
విని యాదుర్యోధనుండు వినయముతోడన్
జనపతి మొదలుగ నందఱు
మనవారికి శుభమె సుమ్ము మనుజాధీశా! 28

వ. అనిన గాంధారేయునకు శమనతనయుం డిట్లనియె. 29

క. ఉన్నార మీవనమున మ
హోన్నతి నాపదలు లేక నురుభుజశక్తిన్
అన్నా! యేమని చెప్పుదు
వెన్నుఁడు మామీఁదనలిగె విపరీతముగాన్. 30

చ. అడవులపాలుగాఁజనిరి యచ్చటమాధవుఁ డల్గె వారిపై
గొడవిడియేల మాకనక గొబ్బునవచ్చితి వీవె యీడకుం
బుడమిని గల్గుభూపతుల భూరిబలాఢ్యుల ద్రోణభీష్ములం
దడయక వెంటఁబెట్టుకొని తద్దయు వేడుక నోసుయోధనా!

ఉ. ధారణి గోత్రసంభవులు తద్దయుఁ దేజము గల్గియుండినన్
ఓరువలేక చూచి మది నూరకకుందుచునుందు రెప్పుడున్
జేరువ నీటిలోఁబడినఁ జేయినొసంగెడి వారికై వడిన్
ధీరతవచ్చినావు కులదీపకసద్గుణ భూరిభూషణా. 32

క. బలహీనుల మైనామని
తలఁపకమదిఁ గరుణనూని తద్దయుభీష్మా

దులబలిమితోడఁ గూడియొ
కులశేఖర! వచ్చినావు గురుభుజశక్తిన్. 33

క. ఆపదపుట్టినవేళను
బ్రాపకులై వచ్చువారు బంధువులరయన్
నీపాటివాఁడు గలఁడా!
యేపట్టున వెదకిఁజూడ నిలలోనెల్లన్. 34

క. అని ధర్మతనయుఁ డాడిన
విని యాదుర్యోధనుండు వినయముతోడన్
జననాథాగ్రణి! యాపద
విని యూరకయుండ నేను వెఱ్ఱినెచెపుమా. 35

క. మా కొక యాపదపుట్టినఁ
బ్రాకటముగ మీఁదిగాఁగ భావ్యముదలఁపన్
మీకును మేమటువలెనే
చేకొనివచ్చితిమితోడు క్షితితలనాథా. 36

వ. అని యిట్లు ధర్మజదుర్యోధనులు పలుతెఱంగుల నిష్టాలాపంబు లాడుచుండి రంత నక్కడ. 37

క. జలదనిభాంగుఁడు నీరజ
దళనేత్రుఁడు శ్రీరమణుఁ డుదారుఁడు తపనో
జ్జ్వలతేజుండగు కృష్ణుఁడు
దళములఁగూర్చుకొనివేగ తాఁ దరలుటయున్. 38

తే. పవనవేగంబు చే మించి పరఁగుచున్న
శైబ్యసుగ్రీవమేఘపుష్పకవలాహ
కము లనెడు ఘోటకంబుల నమరితనరు
జాతరూపరథంబెక్కె జక్రధరుఁడు. 39

తే. రామసాత్యకు లిటునటు రమణ రాఁగ
సుతులు ప్రద్యుమ్న పుష్కరుల్ సొరిదినడువ
సకలశస్త్రాస్త్రములుపూని చక్రధరుఁడు
కదలెబలములతోఁగూడి కదనమునకు. 40

చైవారగద్య:—"జయజయ దేవకీగర్భసుధాబ్ధి సంపూర్ణసుధాకరా! జయజయ యశోదానందరత్నాకరా! జయజయ యదువృష్ణికులసార్వభౌమా! జయజయ ద్వారకాపురనివాసా! జయజయ బ్రహ్మేంద్రాది సమస్తసురముని పూజిత చరణారవింద! జయజయ కుటిలదైతేయపుటభేద మహీరుహ వైశ్వానరా! జయజయ సమరోర్వీజితశాత్రవ! జయజయ దేవదేవ! జయభక్తజనకలుషాబ్ధిబడబానల! జయజయ కలుషసంహారకా! జయజయ సర్వలోకనాయకా! జయజయదానవగర్వాపహారా! జయజయ రుక్మిణీమనఃప్రియ! జయజయ కృపావిధేయా! జయజయ మన్మథోద్భవాధార! జయజయానంత భాస్కరసంకాశా! జయజయ దుష్టనిశాచర మనోభయంకర! జయజయ సకల దిగంతవిశ్రాంత యశోభార! జయజయ రుక్మిణీసత్యభామా మనః కంజాతమిత్ర! జయజయ అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకా! జయజయ వేణుగానవినోద! జయజయ రాధా రమణీమనోహర! జయజయ గంధవాహాశనవైరిపతాకా! జయజయ గోవర్ధనోద్ధారక! జయజయ గోపికావల్లభా! జయజయ భుజంగరాజశయనా! జయజయ బాదరాయణీ సన్నుతా! జయజయ కపటనాటకసూత్రధారా! జయజయ వసుదేవదేవకీకుమారా! జయావిజయీభవ ! దిగ్విజయీ

భవ!''అని యిట్లు వందిమాగదబృందంబు లుభయపార్శ్వం
బులజయజయనినాదంబులతో బిరుదగద్యపద్యంబులు వక్కా
ణింప, ముఖ్యాతపత్రంబులు చెలంగ, దిగ్గజంబులు వడవడ
వణంక, కులాచలంబులు బంతులకై వడినల్లలాడ, నిశా
కరార్కబింబంబులు గతులుదప్ప, నుడుసమూహంబులు
డుల్ల నయ్యవసరంబున మదవారణ బృంహితంబులు,హయ
హేషారవంబులు, రథనేమిధ్వనులు, ఘనంబులగు భట
చరణోద్ఘాత రేణుపుంజంబులు మిన్నుగప్ప ధనుర్బాణాది
నాదంబులు దిశలునిండ, భీమాట్టహాసంబులు కురుబలం
బుల గుండెలవియఁ బటహభేరీమృదంగశంఖకాహాళతూర్య
రవంబులు ప్రతిధ్వనులీయ ననికి యదునాయకుండు కురు
బలంబులపై నడిచె నప్పుడు ముందటిమత్తమాతంగంబులు,
వానివెనుకహయంబులు, వానివెనుక రథంబులు నుభయ
పార్శ్వంబుల వీరభటసమూహంబులు సింహనాదంబులు
సేయుచు నడిచిన. 41

తే. గంధగజహయరథభట ఘట్టనముల
సెగయు ధరణీపరాగంబు నిఖిలదిశల
భానుబింబంబుఁ గప్పె నంబరముతోడఁ
గర్దమంబయ్యె మిన్నేరు కలిసియపుడు. 42

వ. తదనంతరంబ పుండరీకాక్షుండును యదువృష్ణిభోజాం
ధకమహావరులు కదనోత్సాహు లై మహాయుధంబుల
ధరియించి తోడనడువ గజరథారూఢు లైనబలభద్ర
సాత్యకులును ప్రద్యుమ్నాది కుమారవర్గంబు నగణిత

ధైర్య హేమాచలోపమాన వీరభటులునుగొల్వ ద్వైత
వనంబునకు వచ్చె నప్పుడు. 43

క. హరి పాంచజన్యమూదిన
శరధులుఘూర్ణిల్లె భువనజాలములెల్లం
దిరిగెఁ నభమును ద్రెళ్లెఁ
ధరణీధరములువడంకెఁ దారలురాలెన్. 44

ఆ. శమనజుండు పాంచజన్యనాదము విని
యనికిఁదరలివచ్చె నచ్యుతుండు
కదనమునకు లెండు గ్రక్కున మీ రింక
ననుచుఁజెప్పెఁ గౌరవాధిపునకు. 45

ఆ. అంతకన్నమునుపె యతిబలాధికులైన
గురుని భీష్ముఁ గర్ణు గురుసుతులను
జూచిపలికె ధర్మసూనుండు కృష్ణుండు
కయ్యమునకువచ్చెఁ గదసి యపుడు. 46

ఆ. ధర్మనందనుండు తమ్ములఁ గనుఁగొని
కయ్యమునకువచ్చెఁ గంసవైరి
కయ్యమునకు మీరు గ్రక్కున లెండని
యనిన యన్నమాట కలరియపుడు. 47

సీ. పాకారియిచ్చిన భాస్వత్కిరీటంబు
చెలువుమీరంగ నౌ దలధరించి
యీశానుఁ డిచ్చిన పాశుపతాస్త్రంబు
ముదముతోడుతఁ గరమునను గూర్చి
జ్వలనునిచేఁగొన్న చారుగాండీవంబు
బాహుదండంబునఁ బరఁగఁజేర్చి

దేవేంద్రుఁ డిచ్చిన దేవదత్తంబును
హస్తాగ్రతలమున నమరఁజేర్చి
ఆ. మఱియును గపిరాజ మంజులధ్వజమును
ధవళఘోటకములు దనరగల్గి
బాణవితతిచేతఁ బరువడి శోభిల్లు
రథమునెక్కె విబుధరాజ సుతుఁడు. 48

క. హరిచే నాపదనొందక
దురమున విజయంబుగల్గి దోర్బలశక్తిన్
మరలుమని ధౌమ్యుఁ డింద్రజు
సరగున దీవించె నధిక సత్వాఢ్యుం డై. 49

వ. ఆసమయంబున. 50

క. గడగడవడఁకుచుఁ బెదవులు
దడుపుచు వెలవెల్లబాఱి ధరణీస్థలిపైఁ
బడియున్న గయునిఁ జేకొని
జడియకుమని వెన్నుజఱచి శక్రజుఁ డంతన్. 51

తే. గయుని తూణీరమునఁజేర్చి కౌతుకమున
ధైర్యనిర్జరగిరి యనఁ దనరుచుండె
నార్తజనరక్షణోపాయుఁ డర్జునుండె
యనుచు వినువీథి నమరులు వినుతిసేయ. 52

క. అప్పుడు పాంచాలునిసుత
తప్పక యావిజయుఁజూచి ధైర్యమున నరేన్
గప్పుకొనె పిష్ణుసైన్యము
లిప్పుడు నల్గెడలనేల యీనినభంగిన్. 53

క. కొంగునఁగట్టిన రత్నము
మ్రుంగిటఁ జేకొన్న ధనము ముదమలరంగాఁ
దంగేటి జున్ను మనకా
యంగజ జనకుండతండె యరియైవచ్చెన్. 54

సీ. గ్రహగతిచాలక గహనభూములయందుఁ
దిరుగుచునున్నాము దిక్కులేక
కూరలుకూడుగాఁ గుడుచుచునుండఁగా
రారాని యాపద ప్రాప్తమయ్యె
ధార్తరాష్ట్రులచేత దారుణకృతముల్
తప్పెఁగదా యని తలఁచియపుడు
మనపాలివిధియును మన కిట్లు చేసెను
దప్పింపఁ దరమౌనె ధాతకైన
తే. దంతిపతివరదునకు గంధర్వునిచ్చి
యమితశుభములనందుమా యమరరాజ
తనయ! నీవెఱుఁగని నీతి ధరణిగలదె
యనిన ద్రౌపదిఁ గనుఁగొని యర్జునుండు. 55

సీ. భూరిసేనలతోడఁ బుండరీకాక్షుండు
కదిసిసన్నద్ధుఁడై కదలివచ్చె
నీవేళగంధర్వు నిచ్చుట యుచితంబె
వెఱచియిచ్చెననరె వీరవరులు
శరణుచొచ్చినవారి శత్రులకిచ్చిన
పాపాత్ముఁజూడరు ప్రాజ్ఞులెచట
వెఱపు నీ కేలొకో వెన్నునిసేనల
హతముచేసెద భీషణాస్త్రములను

తే. వట్టిమాట లింకేటికి వదల గయుని
హరుఁడు దిక్పతులిచ్చిన వరశరములు
నాకుఁ గల్గుట యెఱుఁగవే నలిననేత్ర
జయముచేకొని యిటువత్తు సమ్మదమున. 56

వ. అని యిట్లు పాంచాలినొడంబఱచి తదనంతరంబున. 57

క. శమనజ మారుత నందను
లమరపతిసుతుండు కవలు నతిమోదమునన్
సమరోన్ముఖులై కదలిరి
విమలకనక రథములెక్కి వేవేగమునన్. 58

క. గురుఁడును గురుసుతుఁడును వెసఁ
గురుపతి ధర్మాత్మజులును గురువీరులతో
పరువడిగ నపుడు నడచిరి
ధరణీశులు తమ్ముఁగూడి తరలినడువఁగన్. 59

తే. శమనజుఁ డనంత విజయంబు శ్వాసనసుతుఁడు
పౌండ్రకము దేవదత్తంబు ఫల్గునుండు
ఘనసుఘోషంబు మణిపుష్పకంబు కవలు
చెలఁగి పూరించిరి మురారిసేన గలఁగ. 60

వ. అప్పుడు చారకుండు దైత్యారింజూచి పాండునందనులు
ఘోరాటవిం జరియించుచు నిడుమలంబడుచున్నవారు
వారలకు నీరథగజవాజినికరంబు లెక్కడి వని యడిగినఁ
బుండరీకాక్షుం డిట్లనియె. గయుని నిమిత్తంబున మనకు
నర్జునునకుఁ గయ్యంబుగలుగు టెఱింగి నారదమునీంద్రుండు
వేదండపురంబునకుంజని యావృత్తాంతంబంతయు ధృత

రాష్ట్రున కెఱింగించి ఫల్గునునకు సహాయంబు గావలయు
ననిన దుర్యోధనుండు సంతోషభరితస్వాంతుం డగుచు
నర్జునునకు సహాయంబుగాఁబోయి కృష్ణాదియాదవుల
నిర్జించి కుంతీసుతులం బరిమార్చి రాజ్యంబంతయు నేక
చ్ఛత్రంబుగా నేలెద ననుచుఁ దలంచి ద్రోణాచార్యాది
యోధులను సమస్తదేశాధీశ్వరులను గూర్చుకొని కుటిల
మానసుండై వచ్చినాఁడు. పాండవు లది తెలియనేరరు, ఈ
వచ్చిన మహాయోధులం జెప్పెద నాకర్ణింపుము. 61

సీ. కాంచననిర్మిత కమనీయకలశాంక
ఘనకేతనమువాఁడు కలశజుండు
పంచాస్యలాంగూల భాస్వత్పతాకంబు
వాఁడు ద్రోణాచార్య వరసుతుండు
ధర్మగోవృష కాంతి నిర్మలభాసుర
వర తేజుఁ డైనట్టివాఁడు కృపుఁడు
లలితాబ్జసత్ప్రికల్పకపతాకావిహా
రంబువాఁ డెన్న ధర్మతనయుండు
తే. పవనసుతకేతనమువాఁడు ఫల్గునుండు
పరుషవిషధరాంకమువాఁడు కురువిభుండు
తాలకేతుండు భీష్ముండు తలఁపవీరు
భూరియుద్ధవిశారదుల్ వీరవరులు. 62

క. ఈశ్వర వర జనితుండా
యశ్వత్థామనుజయింప హరునకు వశమా!
శాశ్వత సద్గుణుఁడును స
ప్తాశ్వప్రతిమాన తేజుఁ డాహవభూమిన్. 63

క. వీరుఁడు ద్రోణసమానుఁడు
భూరివిశారదుఁడు బలుఁడు పురహరునైనన్
బోరఁజయింప సమర్థుఁడు
ధారణిఁ గృపు నెన్నఁదరమె ధాతకునైనన్. 64

తే. సకలశస్త్రాస్త్రనిపుణుండు సాహసుండు
సమరవిజయుండు సత్కులసంభవుండు
అతనితోఁబోర శక్యమే హరునకైన
గౌరవుల కెల్లను గురుండు కలశజుండు. 65

ఉ. ఇనజుఁడు దివ్యతేజుఁడు దిగీశసురేంద్రులు వచ్చిపోరిరే
నని మొనగెల్చువీరుఁడు మహారణశూరుఁడు బాహువీర్యుఁ
డా, యినసమతేజుఁడున్ గువలయేశ సుకీర్తివిశాలుఁ
డెన్నఁగా, ఘనభుజుఁ డీతఁడేవినము కర్ణుఁడు దానగుణ
ప్రపూర్ణుఁడున్. 66

తే. వినుము సంగర శూరుండు వీరవరుఁడు
ఘనగదాయుద్ధకుశలుండు కౌరవేంద్రుఁ
డతనితోఁబోర శక్యమే యవనిపులకు
యోధవరులందు మేటి సుయోధనుండు. 67

తే. సమరవిజయుండు భీముండు సాహసుఁడగు
నతఁడు నెఱియోధవీరుఁడౌ నస్త్రగురుఁడు
సత్యవచనుండు సుజ్ఞానచక్రవర్తి
ప్రళయకాలంపు హరుఁబోలుఁ బ్రథనమునను. 68

వ. అని యిట్లు కృష్ణుండు దారుకునకుం జెప్పి పాంచజన్యంబు
పూరించినఁ బాండవులు తమతమ శంఖంబులొత్తిన సకల

దిశలుపగిలె, వార్ధులు ఘూర్ణిల్లె, నుడుగణంబురాలె, సర్వ మహీమండలిగంపించె, పర్వతంబులల్లాడె, ఆసమయంబున నుభయదళంబులు విరసంబులాడుచు వెడబొబ్బలిడుచు నార్చుచు అట్టహాసంబు సేయుచు యుద్ధసన్నద్ధులై వడిం గవిసి కాల్బలంబుకాల్బలంబును, రథంబులురథంబులను, తురంగంబులుతురంగంబులను, గజంబులుగజంబులను దాఁకి ద్వంద్వయుద్ధంబు సేయ నప్పుడెగసిన ధరణీపరాగంబు తపనబింబంబుఁ గప్పి యన్యోన్యఘాతజనితరక్త సిక్తంబై యడంగు నప్పుడు. 69

క. వీరభటులు రాహుత్తులు
వారణముల పైకివచ్చు వరబలవంతుల్
బోరున రథికులరథికులు
ధారణి కంపింప నుభయదళములుఁ బోరెన్. 70

క. ఒక్కొక్క వీరవంతుని
పెక్కండ్రును జుట్టుముట్టి బెట్టుగఁ ధరపై
స్రుక్కంగ మొత్తివైవఁగ
నక్కజముగ దొమ్మిజగడ మధికముగాఁగన్. 71

సీ. వెనుకైన శత్రుల దునిమివై చెడివారు
దొలఁగక విమతులఁ దునుమువారు
పగతుల శిరములు పగులఁగొట్టెడివారు
మొనసినవైరుల మోఁదువారు
నిలిచివిరోధుల నిగ్రహించెడివారు
తివిరి యహితులను ద్రెంచువారు

కడఁగి ప్రత్యర్థులఁ గలయఁద్రుంచెడివారు
గదఁగొని రౌతులఁ గలఁచువారు
తే. నగుచు యాదవకౌరవు లతిరయమునఁ
గదిసి యత్యంతముగ్రులై కదనమునను
ధీరులై పోరి రప్పుడు దిగులు లేక
విస్మయం బంది చూచిరి విబుధవరులు. 72

వ. ఆసమయంబున. 73

ఉ. కురుపతికర్ణుఁడుంగృపుఁడు కుంభభవాత్మభవుండు నుగ్రులై
మురహరుసేనపైఁగదిసి ముప్పిరివోవ శరంబు లేయఁగా
సురములుగాఁడిపాఱగను నొయ్యన నిల్వఁగ లేక భీతిచే
వరుసను బాఱిపోయి యదువల్లభుమ్రోలను నిల్చి రందఱున్. 

వ. అప్పుడు మురాంతకుండు యదుసైన్యంబుల నిలుమని
నిలువరించి సేనాసమేతుఁడై బలభద్రసాత్యకులతోడ రథం
బురవడించి కురుసైన్యంబులం జుట్టుకొని. 74

సీ. రథములఖండించి రథికులఁ బరిమార్చి
సారథులను బట్టి సంహరించి
గజముల నిర్జించి ఘనహస్తిపులఁగూల్చి
పెక్కండ్రుయోధుల పీచమణఁచి
హయముల మడియించి యారౌతులనుగూల్చి
యెదురొడ్డు భటులను మదమడంచి
గుంపులుగాఁగూడి తెంపుతోడుతవచ్చు
కాల్బలంబులను జీకాకుచేయు

తే. శౌరిగని హతశేషులు చాలబెగడి
కాలునిలువక నురికి యక్ర్కూరవేంద్రు
కడకుఁజనిఁజూచివారల కరుణచేత
నాదరణమునఁ గురుపతి యనికి నడచె. 75

క. కురురాజన్యునిఁబాయక
గురుసుత గాంగేయ కర్ణ కుంభజముఖులున్
శరబాణాసనధరులై
దురమునకుం జనిరి యధికదోర్బలశక్తిన్. 76

ఉ. కౌరవరాజశేఖరుఁడు కంసవిభేదనుఁజూచి యుగ్రుఁడై
దారుణశస్త్రజాలములఁ దద్దయువక్షము గాడనేసినన్
సారసనాభుఁ డల్గితనశార్ఙ్గమునందున వాడితూపులన్
బోరున నొవ్వనేసెఁ గురుభూపతి నాతని సేనలన్నిటిన్. 77

సీ. విబుధ నదీజుండు విపులాంబకంబులఁ
గుంభజతనయుండు గురుశరములఁ
గలశజుండు కెరలి ఘనసాయకంబుల
శరచాపచయముల శక్తికృపుఁడు
దినమణిసూనుండు దివ్యబాణంబులఁ
బెక్కండ్రుయోధులు పెనుములుకుల
భూపాలకశ్రేణి భూరిమార్గణముల
నిసితాంబకంబుల నిఖిలభటులు
తే. కృష్ణుమీఁదను చెలరేఁగి కినిసియపుడు
స్వాతిగతుఁడైనశుక్రుని భాతినస్త్ర

శస్త్రశర్షంబు గురియింప చక్రధరుఁడు
ముక్కలుగఁజేసె మార్గణపుంజములను. 78

వ. తదనంతరంబ. 79

ఉ. ఘోరశరంబులేసెవడి గోపకులాగ్రణిమీఁద మెండుగా
ధీరుఁడు నాగకేతనుఁడు తెంపుగ నంగములందునేసినన్
బోరుననెత్తురొల్కఁగను బూవులగుత్తులతోడనొప్పునా
బూవుగరీతినొప్పె యదుపుంగవుఁడప్పుడు ధారణీస్థలిన్.

సీ. నాగకేతనుజూచి నలినాక్షుఁ డుగ్రుఁడై
భూరిమార్గణముచేఁ బూనిపలికెఁ
బొట్టక్రొవ్వుననీవె పోరికినేతెంచి
కలపఁజూచెదునన్నుఁ జెలఁగియిపుడు
యొనరఁబట్టినయంత యులికిచచ్చెదవీవు
నీపౌరుషంబెంత నేఁడుచూడ
సిగ్గిలలేదు నీపగ్గెవల్లెదుడుంగు
వదలకున్నను నేఁడు ప్రధనభూమి
తే. యీశరంబున ద్రుంతును నీశిరంబు
ననిన ధృతరాష్ట్రతనయుండు నాగ్రహమునఁ
బ్రళయకాలార్కబింబంబుపగిదినుండి
కనులనిప్పులురాలంగ ననియె నపుడు. 81

క. భూపతివి గావు మాతో
గోపాలక పోరనీవు గురుశరముల నీ
యేపణఁగించెద నన విని
శ్రీపతి యయ్యవనకోప చిత్తుం డగుచున్. 82

క. కడు వేగంబునఁ గృష్ణుఁడు
దడయక కురుపతినిరథము తత్సారథినిన్
బడనేసె ఘోరశరములఁ
బుడమిన్ విందానువింద భూపతు లంతన్. 83

క. రారాజు తమ్ములునువడి
ధారుణి గంపింపవచ్చి దైత్యధ్వంసిన్
భూరిశరంబులఁ గప్పిన
నారాయణుఁ డపుడువాని నలినలి చేసెన్. 84

తే. మఱియు వారల రథముల హయలకరుల
సారథులఁ గేతనంబుల సమరభూమి
గడఁగి పడవేసె నప్పుఁ డాకంసహరుఁడు
విశిఖముల నిర్జరావళుల్ వినుతిసేయ. 85

ఉ. పారసబాంధవాత్మజుఁడు సాత్యకిగాత్రమునందు మెండుగా
ఘోరమహాస్త్రజాలములఁ గ్రొంకక నేసిన నాతఁ డుగ్రుఁడై
వారిజమిత్రడింభకుని వక్షమువాఁడిశిలీముఖంబులన్
బోరున నెత్తురుల్ గురియ భూస్థలిఁ వ్రాలఁగ నేసె ధీరుఁడై. 86

క. తెలివొంది మిత్రసూనుఁడు
చలమున సాత్యకినిదాఁక జడియక నతఁడా
జలజాప్త పుత్రు వక్షము
బలుసాయకములనువ్రచ్చె బాహాశక్తిన్. 87

తే. తరిమి సాత్యకిచేతి యస్త్రములువిల్లు
దునియలుగ నేసె ఘనమైన తూపు చేత .

నతఁడు వేఱొకవిల్లంది యర్కసుతుని
భీషణశరంబులను నేసె బిట్టుగాను. 88

వ. ఇవ్విధంబున నాయిర్వురు నుభయసేనలంగల దండిమగ
లును నధిక సంరంభంబున సిద్ధచారణగంధర్వాదులు
చూచి పొగడుచుండఁ బోరు సమయంబున. 98

క. దనుజారి శార్ఙ్గమెక్కిడి
ఘనశరసంఘములమిగులఁ గడుఁగోపముతో
వినువీథిసురలు పొగడఁగ
నినతనయునిగూల్చెనప్పు డిలబలశక్తిన్. 90

క. నందకుమారుని బలముల
నందుంగాత్రంబులందు నతిరోషముతో
మందాకినీతనూజుఁడు
చిందరలై పోవ నేసె శితభల్లములన్. 91

తే. ఆపగాసూనుఁడు నిశాచరారియురము
శరవితతి నేయ రుధిరంబు సందడింప
నతఁడు మోదుగు పూచిన యందమునను
చూడఁగానొప్పె నిర్జరుల్ చోద్యమంద. 92

క. హరికోపంబున శంతన
ధరణీరమణాంగభవునిఁ దత్సారథినిన్
దురగము వరరథమును వెస
శరశతమునఁబడఁగ నేసె సంగరభూమిన్. 93

ఉ. శరగురుసూనుఁ డచ్యుతుని సారథినిన్ జతురాంబకంబు
లన్, అరదము పంచబాణముల నశ్వములన్ బదియాఱు

తూపులఁ, ఇరువదియమ్ములఁ ద్విజకులేశపతాకము వేయ
నన్నిటిఁ, బొరిఁబొడిచేసె మాధవుఁడు భూరిమహోగ్ర
శిలీముఖంబులన్. 94

ఆ. ద్రోణసుతుఁడు కెరలి దొడ్డనారసముల
వెంటనేయగల్చె వెన్ను నురము
దానికలిగిమిఁగుల దారుణాకృతితోడ
ద్రౌణిమీఁదఁగడఁగి దానవారి. 95

క. అరదంబు దునిమిసారథి
బరిమార్చియు హరులగూల్చి బలుకేతనముఁ
విఱిచి తనమీఁదఁ గవిసిన
కురుబలములఁ గీటణంచి గురుసుతుఁదరిమెన్. 96

క. విరథుఁడయి ద్రోణపుత్రుఁడు
మఱియొకరథ మెక్కి నిశిత మార్గణములచే
హరి బలరాముని సాత్యకి
నురములు భేదింపనేసె నురుభుజశక్తిన్. 97

క. గురుసుతుఁ డేసిన సునిశిత
శరజాలము లెక్కగొనక సమరావనిలో
హరి గురుసుతు నొకశరమున
సరథముతోఁ దొలఁగనేసె సక్రోధుం డై. 98

తే రథముపోయిన వేఱొక్క రథమునెక్కి
గురుకుమారకుఁ డుగ్రుఁడై గోపవీరు
తురగరథకేతనంబుల నురుశరముల
చేతఁ గప్పిననుగ్రుఁ డై శ్రీధరుండు. 9

క. ఆశరముల నన్నిఁటివే
యాశుగపంచకము చేత నతిరోషము చేఁ
గేశవుడుం దుత్తునియలు
చేసితఱిమె గురుకుమారు సేనలనెల్లన్. 100

వ. తదనంతరంబ. 101

క. గురు కృపు లశ్వత్థామ య
మరరాజతనూభవుండు మారుతసుతుఁడుఁ
గరవాలాద్యాయుధములఁ
గరములఁ గీలించియపుడు కదిసిరి హరిపై. 102

క. సారథి నైదుశరంబుల
నాఱుమహోగ్రాస్త్రములను హయములశిరముల్
భూరిశరంబుల హరిపై
ధీరతనాచార్యుఁడేసె దివిజులు వొగడన్. 103

వ. మఱియు ధనురాచార్యుండును దత్సుతుండును భీమార్జును
లును జలంబున బలభద్రసాత్యకుల యదుబలంబుల తురం
గంబుల గప్పుకొని ఒక్కొక్కనిమేన నెడలేక బలుబాణం
బుల నించిన భయభ్రాంతు లయి చిత్రపటంబులచందంబునఁ
జేష్టలు దక్కియున్న సమయంబున. 104

ఆ. ద్రోణుమేననొక్క దొడ్డనారసమును
సాయకత్రయమున స్యందనంబు
తురగములనుసూతు శిరమును బడనేసె
బాణపంచకమున దానవారి. 105

తే. శస్త్రగురుఁడు మహోగ్రుఁడై శౌరిమీఁద
నస్త్రవర్షంబు గురియింప నచ్యుతుండు
వానినన్నిఁటి ఖండించి వసుధపైని
మూర్ఛనొందఁగఁజేసెను మురహరుండు. 106

వ. అప్పుడు. 107

క. హరిఁజూచి భీమసేనుఁడు
కరమున గదఁ బూనివచ్చి ఘనరౌద్రమునన్
మురహరు తేరును శరమును
ధరపైఁ దుత్తుమురు జేసె దర్పంబలరన్. 108

తే. రథవిహీనుఁడై వేఱొక రథమునెక్కి
రాక్షసారాతి కీచకారాతిఁజూచి
యుగ్రకోపియై శక్తిచే నురమునాట
నేయస్రుక్కకయుండె నవ్వాయుజుండు. 109

వ. ఇట్లు కదలకయున్న వృకోదరుం జూచి హరి యిట్లనియె.

క. తిండికి మిక్కిలి ఘనుఁడవు
భండనమున గౌరవుగావు బ్రాహ్మణయిండ్లన్
బండెడు కూడెత్తుక తిని
కండలుపెంచుకొని బ్రతుకు కదలుముభీమా! 111

క. మండలనాథులయిండ్లన్
వండుచు నీవుండకిపుడు వరయోధువలెన్
దండిమెఱసి వచ్చితి వీ
భండనమిది యేలనీకుఁ బావనిచెప్పుమా! 112

క. అని యిట్లు కృష్ణుఁ డాడిన
విని యాపవనాత్మజుండు వెన్నునితోడం
యనలములో ఘృత మిడుగతి
మన మెఱియగ మండిపలికె మాధవుతోడన్. 113

క. నాపిడికిటిపోటున నీ
యేపణఁగించెదను నిల్వు మీశుఁడు నీకుం
బ్రాపకుఁడయి యిటవచ్చిన
గోపాలక పోవనియ్య గురుభుజశక్తిన్. 114

వ. అని వృకోదరుండు దందహ్యమానమానసుండై ప్రళయ కాలాగ్ని రుద్రునివోలె మండిపడుచు నిష్ఠ్యూతగదాధరుం డగుచుఁ గమలాక్షురథంబు మీఁదికిం లంఘించి యాతని వక్షంబు బెట్టుగఁ దనముష్టిచేఁ బొడువ దానికిం జలింపక మాధవుండు భీమునియురంబుం బెడిదంబగుశక్తిచేవేయ నతఁడు భిన్నవక్షుండై స్రుక్కి నిలువనోడి రథంబు డిగ్గి పోవం గాళులాడకయున్న సమయంబున రామసాత్యకులు సింహనాదంబులు సేయుచు వచ్చి భీమసేనునిపైఁ గవిసి నిశితశరంబులఁ బ్రయోగింప వానినన్నింటి నొక మహోగ్ర భల్లంబునం దునిమి సాత్యకి శిరంబుఁ దన గదచే మోఁదిన నతండు మూర్ఛితుండై భూమిపై వ్రాలె నంత నచ్యుతా గ్రజుండు భీముని శిరంబుఁబట్టి పెనంగిన బవనతనయుండు వడిం దప్పించుకొని నీలాంబరు నురంబునడచి యావలం జని యాదవులం బట్టుకొన్న బెబ్బులింగని పోవు తేళ్లవలె యాదవులు మాధవు మఱుఁగుఁజొచ్చిరి. అప్పుడు కృపా

శ్వత్థామార్జునులును భీమునకుఁ దోడై చండకాండ
జాలంబులు మాధవరామసాత్యకులమీఁదఁ బ్రయోగించి
యాదవభటుల నొక్కొక్కని మేన నిండారుగా వాడి
శరంబుల నించి రథికులం ద్రుంచి రథంబుల విఱిచి, యేచి
నడచిన పుండరీకాక్షుండు ప్రళయకాలానలోపమానుం
డగుచు. 115

తే. గురుని నాలుగుశరములఁ గూలనేసెఁ
కృపునిపంచశరంబులఁ గీటణంచె
గురుతనూజుని నొక్కటఁ గూలనేసె
సరసిజాక్షుండు భీషణ సాహసమున. 116

ఆ గాడ్పుకొడుకు కెరలి కామపాలుని తేరు
విఱిచి సూతుమోఁది వీతితతులఁ
దోలి, వానిశరము తునియలుగాఁజేసి
గదను బొడిచె హరిని ముదముతోడ. 117

క. రాముఁడు పటురోషంబున
భీముని వక్షంబుదాఁకి బెట్టుగ గదచేఁ
దామసమందఁగ వేసిన
నామారుత సుతుఁడు దెలిసి యతిమత్సరుఁ డై. 118

సీ. కోపించి గోత్రంబుఁ గొనివచ్చి భీముండు
హరిపైనవేసిన హలధరుండు
వజ్రబాణముచేత వ్రయ్యలుగా నేయ
బహురోషయుక్తుఁ డై పవనసుతుఁడు

భూజములఁ బెకలించి రాజులపై వేయ
శితశస్త్రములఁద్రుంచె సీరపాణి
గంధవాహసుతుండు ఘనశక్తివైచిన
ముత్తునియలుచేసె ముసలికెరలి
తే. మఱియు నీరీతి నిద్దఱు మచ్చరించి
యిలకు లంఘించి మిక్కిలి యేపుమించి
గజముగజమును దాఁకెడి కరణిదోఃప
భూరిసాహసములతోడఁ బోరిరపుడు. 119

వ. ఆ సమయంబున. 120

క. మనమున మారుతసూనుఁడు
తనసుతుమదిలోనఁ దలఁపఁ దద్దయు వేడ్కన్
దనుజభటానీకముతోఁ
జనుదెంచె ఘటోత్కచుండు జనకునికడకున్. 121

వ. వచ్చి పాండుతనూజులకు నమస్కరించి ముకుళితకరకము లుండై యేనిమిత్తంబున నన్నుం దలఁచితిరి నేఁజేయవలయు కార్యంబేమని యడిగిన ధర్మజుండు కృష్ణార్జునులకు గయునివలనఁ గలిగిన కలహంబు తెఱంగంతయు నెఱిం గించి నీవు బలంబులతోడఁ బుండరీకాక్షుని సేనల సంగరం బునం జయించి రమ్మనిన నొడంబడి రణోన్ముఖుండై తన బలంబులం గూర్చుకొని వెక్కుమాయలచేత యదువృష్ణి భోజాంధక ప్రముఖయోధులం దలఁపడి తద్దళంబుల విద ళించుచు గంధసింధుర హయములఁ గూల్చుచు బెట్టుగాఁ బోరాడఁ దొడంగె. 122

సీ. గాఢాంధకారంబు కల్పించెనప్పుడు
మెండుగా దిశలెల్ల నిండుకొనఁగ
శైలముల్ పెకలించి చలమునఁపై నేసి
యంబుదంబులరీతి నార్చుమిగులఁ
బిడుగులచందాన ఫెళఫెళ మ్రోయుచు
బ్రహ్మాండభాండముల్ పగిలిపోవ
వెన్ను నిసేనల వెన్నంటి బెట్టుగా
నంద ఱఁ గూల్చెనా యలఘుబలుఁడు

ఆ. గొల్లవానికేలకో గద కయ్యంబు
చల్ల పాలు నెయ్యి చాలనమ్మి
ఆలకదుపు నేలి యార్జించు ధనమెల్లఁ
బార్థివులకు నిచ్చి బ్రతుకవలయు. 123

వ. అనిన నిర్జర వైరిం జూచి మురసంహారుండు తన దివ్యా
స్త్రంబుల వింటం బూనినప్పుడే ఖండించి యా దనుజా
ధీశుండు మహీజంబొండు మాధవుపై వైవ దాని భూమిపై
బాణంబుల దోర్ల నేసి మాధవుండు చర్వంబున మించిన. 127

ఉ. కోపమునన్ ఘటోత్కచుఁడు కోయనియార్చి మహీధరం
బునా, గోపకుమారు మీఁదఁబడఁ గొబ్బునవైచిన దాని
నప్పుడే, శ్రీపతివజ్రబాణమున శీఘ్రమె ద్రుంపఁగనంతదాన
వుం, డేపున సాలవృక్షమున నేసెను మాధవురొమ్ము నొ
వ్వఁగన్. 124

ఉ. ఏసిన నప్పుడచ్యుతుఁ డహీనరుషన్ దనుజేశుపాదముల్
వాసిదొలంగ భూస్థలిని వ్రాలఁగనేసె శిలీముఖంబులన్

రోసిసురారియాహరిని రొప్పుచువచ్చి యురంబుదాఁకినన్
గేశవుడుద్ధతిన్ గనలి కీచకవైరితనూజుఁ దన్నినన్. 125

చ. దనుజుఁడు రాక్షసాంతకుని దర్పమణంచెద నంచునుగ్రుఁడై
కనుఁగవనిప్పుకల్గురియఁ గాఁదగనచ్యుతు డాఁకిధీరతన్
దునియలుచేసిస్యందనముఁ ద్రోలెనుసారథి ఘోటకంబులన్
వనరుహపత్రలోచనుఁ డవారితచండమహోగ్రకోపిదై. 126

మ. కరములున్ మస్తకముల్ ముఖంబుగళముల్ గర్ణంబులున్నా
సలున్, జరణంబుల్ వదనాళిఁబెన్నురములున్ జానుల్
భుజాపీఠికల్, మురసంహారుఁడు నజ్జునజ్జుగగదన్ మోఁదెన్
మహాక్రోధియై,సబుచెన్ రాక్షసమూకనల్లడులకున్ బ్రాణాళి
పైనాశచేన్. 127

వ. అప్పుడు హరింజూచి సమీరసూనపుత్రుం డుగ్రాకారుండై
యి ట్లనియె. 128

శా పోనీయన్ యదునాథయింకవినుమా పోకార్తునీసేనలన్
సూనాస్త్రారి సహాయుఁడైన ననిలో శూలంబుచే నిప్పుడే
ప్రాణంబుల్ వెసఁబుచ్చుకున్నమాటి నేరక్షశ్చమూభర్తనే
రా నాబాహుబలంబు చూడుమనిఘోరాకారుఁడై యా
ర్చుచున్. 129

క. హరిపై శూలమునేసిన
మురసంహారుండుదాని ముత్తునియలుగా
నురుశరయుగ్మముచేతను
బరువడిఖండించెవైచి బాహాశక్తిన్. 130

వ. అప్పుడు. 131

తే. అట్టహాసంబు లొగిచేసి యవనివణఁక
ఘోరబాణంబు వింటను గూర్చినిల్చి
రాక్షసేంద్రుండు ఘనపరాక్రమముతోడఁ
బద్మలోచను వీక్షించి పలికె నపుడు. 132

సీ. పోనీయ నిన్ను నంభోరాశిఁజొచ్చిన
మేదినీధరములో మెలఁగనియ్య
నవనీతలముక్రింద నణఁగియుండఁగనీయఁ
బురుషసింహుండవైనఁ బోవనియ్య
గుఱుచబుద్ధులు పూనఁగొనసాగఁగానియ్య
బాపడ నే నన్ను బ్రదుకనియ్య
నడవులకరిగెద నన్నను బోనియ్యఁ
దీర్థయాత్రలకైనఁ దిరుగనియ్య
తే. ఘనప్రబుద్ధుఁడ నన్నునుఁ గదలనీయఁ
గలికితనమున వచ్చిన గర్వమణఁతు
నాకు సరివాఁడవే నీవు నరుఁడవెన్న
రాక్షసులతోడి పోరేలరా? మురారి! 133

క. నరుఁడవు నీవాదువు గద
నరులను భక్షించువారు నావారుగదా!
యెఱుఁగక యూరకపోరెను
జరగుఫలంబేమినీకు సంగరమేలా? 134

వ. అని యివ్విధంబునం బలుకుచు నానరాంతకుం డత్యున్నత మహీధరంబులు నానవాంతకు పైనేయ నతండు వాని నన్నింటినిఁ దునుకలుగావింప నిలింపవైరి యచ్చటి భూరు

హంబులెల్ల సమసినంజూచి గిరులు పెకలించి యగ్గిరిధరుపై
పైవ మురహరుండు వజ్రబాణంబున వానినెల్ల పొడిచేసిన
నరభోజనుండు శరచాపధరుం డై యిట్లనియె. 135

సీ. జంభారిచేనున్న దంభోళికన్నను
నాయస్త్ర మెక్కుడు నలిననాభ
పార్వతీరమణుని ఫాలాగ్నికంటెను
నధికంబు నాబాణ మంబుజాక్ష
కాలాంతకునిచేతి కాలదండముకన్న
ఘనము నాకాండంబు కమలనయన
పరమేష్ఠిచేనుండు బ్రహ్మాస్త్రమునకన్న
నాశర మెక్కుడు నాగశయన
తే. అనుచుఁ గోపించి దైత్యుఁడా హరియురంబు
నొవ్వనేసిన దివిజారి యొడలినిండ
వాడితూఁపుల నిగుడింప వాఁడుగినిసి
చాపమున సాయకమునుంచి శౌరి జూచి. 136

సీ. సురలఁజూచినరీతిఁ జూడకు రాక్షసే
శ్వరులము వికచాబ్జపత్ర నేత్ర!
దావానలములోన తలఁకొని శలభంబు
వడెదుకై వడి నీవు వచ్చితిప్పు
డీబాణవహ్నిచే నిలమీఁద నినుఁగూల్తు
గర్వంబు నీకేల కడకుఁదొలఁగు
చలపట్టి నిలిచిన శరములఁ బడవైతు
నాతతశక్తినేఁ డవనిలోన

తే. అనుచుఁ గ్రూరశరంబేయ నచ్యుతుండు
దాని నవలీల నఱిగించి దారుణాంబ
కమునుపైనేసి వేగమ కంసవైరి
యప్పుడు పడవైచె నాతని నవనిమీఁద. 137

క. ఘోరాకారుఁడు క్రూరుఁడు
మారుతిసూనుండు భూమి మడిసినయపుడే
ధారుణి గిరు లహికూర్మము
వారణములునెల్ల వణఁకె వరభారమునన్. 138

తే. కవలు ప్రద్యుమ్నపుష్కరుల్ కదిసియపుడు
చండచాపావళులతోడ దండిమెఱసి
యవని గంపింపఁబోరిరి యద్రియద్రి
తాఁకుగతి వెన్కదీయక ధైర్యమూని. 139

క. ఘనరోషంబున మాద్రీ
తనయులు చటులాంబకములు తళతళమెఱయన్
వనజాక్షు సుతుల నేసిరి
చనుమొనలును గాడిపఱచి జగతింగ్రొచ్చెన్. 140

వ. ఆ సమయంబున. 141

సీ. ప్రద్యుమ్నపుష్కరుల్ బహురోషయుక్తులై
బాణాసనంబుల బాణతతులఁ
జేర్చి కవలమీఁదఁ జెలరేఁగివైచిన
వారును నవియొక్క వరశరమున
తునుకలుగాఁజేసి దోర్బలశక్తిచే
నలినాయతాక్షు తనయులమీఁద

నిశితాంబకంబులు నిండారఁగా నైవ
నవియెల్ల నణఁచిరి యాక్షణంబె

తే. మఱియు రథముల దిగివచ్చి మచ్చరమునఁ
గదిసితనువులు శిరములు గదలనడఁచి
హరిసుతులు నేలఁబడనీడ్చి రణఁచిపట్టి
రొమ్ముపైనెక్కి శిరముల గ్రుమ్మిరపుడు. 142

క. తాలాంకుఁడుం శ్రీపతియును
బాలురకడ్డంబువచ్చి వడివడి మాద్రీ
బాలుర శిరముల ముంచిన
నాలో బలరాముసేసి రతిదర్పితులై. 143

వ. అంత. 144

తే. ప్రళయకాలాంతకునిరీతిఁ బరిఢవిల్లి
యచ్యుతాగ్రజుఁడల్గియా యస్త్రతతుల
దునియలుగనేసె ఘనమైన తూపుచేత
మాద్రితనయులపైఁబడి మచ్చరమున. 145

క. కరికరి హరిహరి గిరిగిరి
పొరిఁబొరి పోరాడురీతి భుజబలశక్తిం
దఱచుగ రాముఁడు మాద్రీ
వరతనయులుఁ బోరఁజూచి వాయుజుఁడలుకన్. 146

క. చిచ్చునకు గాలితోడై
వచ్చినగతి ధనువుఁబూని పటుతరశక్తిం
మచ్చరమెదఁ బెనఁగొన వి
వ్వచ్చుని యగ్రజుఁడువచ్చె వసుమతివణఁకన్. 147

సీ. కాలాంతకునిరీతిఁ గరమర్థిఁ బెంపొంది
మారుతతనయుఁడు మచ్చరించి
కామపాలునిమీఁద గదిసిఘోటకముల
సారథిశిరమును సమయఁజేయ
రోహిణీతనయుండు రోషంబు రెట్టింప
గంధవాహాత్మజు గదలనీక
హాలమునస్యందన హయములఁ బరిమార్ప
విరథులై యిర్వురు ధరణిమీఁద
తే. నిలిచిశస్త్రంబు లుప్పొంగ జలముఁబెంచి
గట్టుగట్టును దాఁకెడు కరణిఁదోఁప
భూరుహంబుల పెకలించి మోఁదిమోఁది
యలఘుబలుడెంచి బాహువు లప్పళించి. 148

చ. పటుతరరోషజాలమునఁ బావనికాలుని లీలనుగ్రుఁడై
చటులగదాధరుండగుచుఁ జక్రధరాగ్రజుదాఁటియావలం
దటుకున నేగియుద్ధవిడి దానవభంజను సేనలన్నియుౕ
ఇటునటుఁబోవనీకగద నేపణఁగించెను ధీరచిత్తుఁడై. 149

వ. అప్పుడు. 150

క. గజములు మృగపతిఁ గనుఁగొని
యజములు వృకరాజుఁగాంచి యపరిసరీతిం
బ్రజభీమసేనుఁ గనుఁగొని
నిజపురిమార్గంబుఁబట్టె నిలువక భీతిన్. 151

క. పోనీక భీమసేనుఁడు
దానవరిపుబలమునెల్ల దారుణలీలౕ

మానక పోరగ వెసఁ బవ
మానతనూభవునిగాంచి మల్లడిగొనుచున్. 152

తే. వీని ననిఁ గెల్వఁగాలేఁడు వెన్నుఁడైనఁ
జేరి చెనకంగ వెఱచును జిష్ణువైనఁ
జూడనోపఁడు తలయెత్తి శూలియైన
నెందుఁబోయినఁ బోనీయఁ డింకమనల. 153

వ. అనుచు భీమసేనుంగాంచి. 154

క. ప్రాణంబులతోడ జగ
త్ప్రాణకుమారక! మహానుభావస్తుత గీ
ర్వాణ దయాపర భీరు
త్రాణపరాయణుఁడమమ్ముఁ దగఁబ్రోవు మిలన్. 155

వ. ఇవ్విధంబున యాదవవీరులు వృకోదరుగదాఘాతంబు నకు నిలువనోపక భయభ్రాంతులై మెఱలిడుచున్న సమ యంబున బలభద్రుండు వారలభయంబు నివారించి. 156

క. బలిమి బలరాముఁ డప్పుడు
చలమున పవనాత్మజన్ము చావఁగ ననిలో
హాలమునఁ దలపై మోఁదిన
గళవళపడి మూర్ఛనొంది గ్రక్కునమరలన్. 157

ఆ. తెలిసి యంతలోనె చలము దీపింపంగఁ
గామపాలుని మెడ కదిసిపట్టి
పెనఁగ గంధవాహ తనయునిఁ గనుఁగొని
రోహిణీసుతుండు రోషమునను. 158

క. గాలిసుతుని తలపగులఁగఁ
హాలాంకుఁడు ముష్టిఁబొడువ దానవుడలుకం

గాలునిగతి నాభీముఁడు
నేలంబడఁ ద్రోబ్బెనతని నెమ్ములు విఱుగన్. 159

వ. ఇట్లు మహాబలపరాక్రము లైనకృష్ణార్జునాగ్రజులు దంద
హ్యమానమానసులై యరుణాయమాననేత్రాంచలు లై
హుంకరించుచు నోడు గఱచుచు మేనులు పెంచి యట్ట
హాసంబులుసేయుచు భూనభోంతరాళంబులు నిండ శేష
దిగ్గజకూర్మంబులు చలింప నభంబు పై భూతంబులు
గంపింప నిరువురుం గవిసి సారెసారెకుం బెనంగి మేరు
మందరభూధరంబులు వడిందాఁకుచందంబున నన్యోన్య
జయకాంక్షలచే కరంబులు కరంబుల పాదంబులు పాదం
బులఁ బెనుచుకొనుచు ముష్టి ఘట్టనలు సేయుచు ధరణీ
పరాగంబులు నెగయంబడుచు లేచుచు పట్టినపట్టువదలక
గజకచ్ఛపంబుల విధంబున పోరు సమయంబున. 160

ఉ. ధీరుఁడు సాహసుండు బలదేవుఁడు భీముఁడుఁ బోరజూచి
యా, వారిజపత్రలోచనుఁ డవారితదుర్ఘట భీమకోపియై
ఘోరశరవ్రజంబునను గూలఁగనేసె సమీరసూనునిన్
భూరిబలాఢ్యులంగవల భూమినిగూలఁగనేసెనాఱిటన్. 161

వ. ఆక్షణంబున హతశేషులు వేగ చని యర్జున కిట్లనిరి. 162

సీ. రారాజుచచ్చె సురనదీసుతుండీల్గె
ద్రోణుండు గడఁచెఁ గర్ణుండుగూలె
బెద్దనిద్దురవోయె భీష్ముండు భీముండు
నకులదుశ్శాసనుల్ నాశమైరి
కలశజసూనుండు కాలంబుచేసెను
గృపసహదేవులు కెడసిరనిని

సకలరాజశ్రేణి సమసెను బోరిలో
మారుతపుత్రుని మదమణంగె
తే. గజహయావళులెల్లను గంతుకొనియె
సర్వరథభటవర్గంబు సమసిపోయె
నేమిచెప్పుదు మేమింక నింద్రతనయ!
యంబుజోదరు తీవ్రబాణాగ్ని చేత. 163

వ. అని చారులువిన్నవించిన విజయుం డత్యంతకోపోద్దీపితుం డై కృష్ణునిపైం గవిసెనప్పుడు. 164

మ. బలభద్రాచ్యుత సాత్యకుల్మొదలుగా బాహాబలాటోపులై
బలభిత్సూనునిం జుట్టుముట్టుకొనిబల్ బాణంబులన్ వైచినన్
జలనంబందక వానినెల్లందునిమెం జండాంశుకాండంబులం
బలుయోధావళి గర్వముల్ గడపెనప్పార్థుండు సక్రోధుండై.

వ. ఇవ్విధంబున నర్జునుండు ప్రయోగించిన బాణానలజ్వాల లకుం దాళలేక యదువృష్ణిభోజాంధక రామ సాత్యకి యోధవరులు దందహ్యమానమానసు లై కాలదండ ధరాకారులై సకలాయుధంబుల ధరించి సింహనాదంబు లెసంగం గవిసిన విజయుండు హిమాచలంబుచందంబున నిలిచినం జూచి విజృంభించి వజ్రనిభంబులగు నిశితబాణా స్త్రంబులం గప్పిన నప్పాండురాజతనయుం డనర్గళప్రవా హంబులైన శరంబుల నన్నింటి నొక్కొక్క ఘోరనిశితా స్త్రంబునం దుత్తునియలుగాంజేసి యదుబలంబునం బ్రలం బాదిసాత్యకులమీంద నగణితదివ్యాస్త్రంబులేసిన వార లత్యంతభయభ్రాంతు లై నిలిచి రప్పుడు. 166

క. విచ్చలవిడి నిలిచిరి వి
వ్వచ్చునిశరజాలములకు వణఁకుచు నిలవై
విచ్చి వెస యదుబలంబులు
చెచ్చెఱఁ బాఱంగఁజూచి చిడిముడిపడుచున్. 167

క. పదపడి కృష్ణాగ్రజుఁడు
న్మదుఁడై వెసవచ్చి ప్రథన మహిలో నిను నీ
గద చేఁ గూల్చెద నర్జున
కదలక నిలు మనుచునలుక గదవడి వైచెన్. 168

సీ. పావకజ్వాలలఁ బరువడి నేతెంచు
గదఁజూచి కోపియై కవ్వడియట
సునిశితాస్త్రంబులఁ దునియలుగా నేసె
బహురోషయుక్తుఁడై ఫల్గునుండు
కామపాలుని తేరు ఖండించి క్రోధియై
వరశరములచేత వసుధవైచి
సారథిఁబరిమార్చి చతురంబకంబులఁ
బడనేసె తూపున సిడముఁబుడమి
తే. తక్కినటువంటి సేనల దారుణాస్త్ర
తతులఁజెండాడి యుద్ధతి దర్పమెసఁగఁ
బ్రళయకాలాంతకునిరీతిఁ బరిఢవిల్లి
యున్నయింద్రాత్మజునిజూచి వెన్నుఁడలిగి. 169

తే. సవ్యసాచిని సూతుని సాయకమున
నొవ్వనేసిన నుగ్రుఁడై కవ్వడియును
విష్ణునిరథంబు విరుగఁగ విశిఖతతుల
నేయ హరి వాని నణఁగించె సాయకమున. 170

వ. ఇట్లీలంగున నా యిరువురు నెక్కువతక్కువలు లేక పోరుచున్నం గాంచి సిద్ధచారణగంధర్వాదులు తమలోఁ తా మిట్లనిరి. 171

ఉ. ఏమనిచెప్పవచ్చుభళి యీహరిపార్థులబాహువీర్యముల్
రామునిసాటివత్తురు శరస్థితివిద్యకు వీరిధైర్యముల్
హేమమహీధరంబునకు నెక్కువ వీరలతోడ మార్కొనం
సోమధరుండు వాసవుఁడు సూర్యకులోద్భవుఁడైన శక్తుఁడే?

క. వనములఁ గాల్చెడు శుచి నే
యనువునఁజల్లార్పవచ్చు నతిభీమంబౌ
ఘనవాహసుతుని గృష్ణుని
ఘనకోపము మాన్పవశమె కరివరదునకున్. 173

వ. అని తలంచుచున్న యవసరంబునఁ గృష్ణుండు జిష్ణుంగదియ నతండు. 174

తే. సూతు తీవ్రశరంబున స్రుక్కనేసి
గదిసియస్త్రము లేడింట గర్వమణఁచి
శిరముద్రుంచెను రయమున ధరణిఁబడఁగ
జలముఁబెంచి మహోన్నతి శక్రసుతుఁడు. 175

వ. తదనంతరంబ. 176

తే. పరమపురుషుండు క్రోధియై పార్థుమీఁద
బాణవర్షంబు గురియింప ఫల్గునుండు
వానినన్నిటి దునుమాడె వాడియైన
శరముచే నర్జునునిజూచి శౌరి యనియె.' 177

సీ. గరళంబు పెట్టించెఁ గౌరవాధీశుండు
వాయుసూనునకుఁ గపటమువలనఁ
బాములచేతనుఁ బావనిఁ గఱిపించెఁ
గ్రోధియై మిక్కిలి కురువిభుండు
లక్కయింటను విష్ణు లయముచేసెదనంచు
నింగలమిడఁజేసె నీర్ష్యచేతఁ
జలమునఁ బాంచాలి సభలోన రారాజు
కోకలు విడిపించెఁ గుత్సితమున

తే. అట్టియాపదలెల్లను మట్టుపెట్టి
కాచిరక్షించినాఁడను క్రమముతోడ
నేడు నవియెల్లఁ దలఁపక నీవెయిపుడు
కత్తిగట్టితి నామీఁదఁ గయ్యమునకు. 178

ఆ. అగ్నిలోన మిడుత భగ్నమైనట్టులుఁ
బోరిలోననీవు పొలయనేల?
గయునిబట్టియిచ్చి కనవోయి మామేలు
చలమునీకుఁ దగునె శక్రతనయ! 179

వ. అనిన ఖగేంద్రధ్వజునకు వానరేంద్రధ్వజుం డిట్లనియె.

చ. పురహరమిత్ర నీలమణి భూషణ కాంచనచేల, ధీర దు
ర్భరయసురాన్వయాపహర వారిజలోచన కామినీమనో
హర నరకారి శ్రీయదుకులాంబుధిపూర్ణశశాంక దేవకీ
వరసుకుమార భక్తజనవత్సల కృష్ణ త్రిలోకసన్నుతా! 181

వ. అని వినుతించి. 182

సీ. కమలాక్ష వినవయ్య గంధర్వపతినీకు
నెగ్గుచేయుట నేను నెఱుఁగ నిజము
నాప్రాణములఁగాచి నన్నేలుఘల్గునా!
నమ్మివచ్చితి నోయనాథనాథ!
యనిన మీకృపచేత నాతని మన్నించి
యభయంబొసంగితి ననఘుచరిత!
పగవాఁడు శరణన్నఁ బార్థివోత్తములకు
రక్షించుట బిరుదు రమణతోడఁ
ఆ. గయ్యమునను నీకుఁ గవ్వడి భయమంది
పట్టియిచ్చె గయుని బంతముడిగి
యనుచు నగరెనన్ను నదనీశు లెల్లరు
తుదను నీకుఁ దగునె? తోయజాక్ష! 183

సీ. గయుఁడు దైత్యుఁడుగాఁడు గంధర్వపతిగాని
యతనిఁజంపఁగ నేల యంబుజాక్ష!
అమరగంధర్వాదు లత్యంతభక్తులు
సతతంబు నీకును జక్రహస్త!
యెఱుఁగక నీకితఁ డెగ్గొనరించిన
ఖండింపఁబాడియే కమలనాభ!
ప్రాణభయంబున పాఱివచ్చినవాని
నిగ్రహింపఁదగునె? నీరజాక్ష!
తే. అతని నిష్ఠీవనంబప్డు డా సమీర
వశతదోయిటిలోఁబడ వాని నీవు
సమయఁజూచుట యిదియెంత సాహసంబు
శరణతో గయుఁగావుము పరమపురుష! 184

సీ. రాజీవదళనేత్ర రవికోటి సమతేజ
సకలలోకాధీశ సదయహృదయ
గజరాజరక్షక కమలా మనోహర
యమరేంద్ర సన్నుత యమితశౌర్య
నీప్రాపుచేతనే నెమ్మది నుంటిమి
పాండుభూపాలుని పదములాన
నీతోడ పోరంగ నేనెంతవాఁడను
నీమేలు మఱువము నీరజాక్ష
తే. మనవి వినవయ్య యదునాథ మధువిరోధి
మచ్చరంబేల గయుమీఁద మదనజనక
వానిరక్షించి నాకీర్తి వసుధయందు
వెలయఁజేయుము శ్రీకృష్ణ విమలచరిత! 185

వ. అనిన వాసవసూనునకు వసుదేవసూనుం డిట్లనియె. 186

క. ఈనేర్పును నీవినయము
నీనయగారంపుఁబల్కు లీబూటకముల్
మానుము గయుఁనీయిక నినుఁ
బోనియ్యం బాండుతనయ పోకార్తుఁజుమీ! 187

క. చుట్టమ వని చూడను నిఁకఁ
జట్టలువా పెదనునిన్ను శరజాలములన్
ఇట్టట్టు పోవనియ్యను
గట్టితనం బద్దిచూతుఁ గయ్యములోనన్. 188

వ. అనిన వాసవాత్మజుండు క్రోధియై యప్పుడు. 189

సీ. గంధేభతుండముల్ ఖండించి ధరణిపైఁ
గూల్చెను రథములఁ గోపమునను
భటసమూహంబు లట్టిటులు పోనీయక
కూలఁగా నేసెను గుంతములను
దురగసంఘంబులఁ దునియలుగాఁ జేసె
ఘనయోధవరుల చీకాకుపఱచె
మొత్తమై యాదవ మూక లేతెంచిన
నందఱ నణఁగించె నాక్షణంబ
తే. ప్రళయకాలాగ్ని వడువునఁ బ్రజ్వరిల్లి
చండకాండగణంబులఁ జక్రధరుని
సేనసమయంగఁ జేసెను జెలఁగిచెలఁగి
శక్రసూనుండు మిక్కిలి చలమువూని. 190

సీ. పదియాఱుతూపులఁ బద్మనేత్రాగ్రజు
నిరువదియమ్ముల మరుని గురుని
సాయకవింశతి సాంబాభిధేయుని
బంచబాణుని బాణ పంచకమున
భాసురాస్త్రంబున భానుబద్ధాహ్వయు
భాసాఖ్యు నవతారబాణములను
ఇరువదియమ్ములఁ బరువడిఁ గృతవర్మ
ననిరుద్ధుని బదాఱు ఘనశరముల
తే. ముప్పదింటను శ్రుతదేవుఁ బుష్కరాహ్వ
సాయకత్రితయమ్మున సాత్యకినిని
నణఁచితక్కిన సైన్యనాయకులఁ దఱిమి
వేయ హరిసేనలురికెను విజయుఁ జూచి. 191

ఆ. జంభభేదిసుతుఁడు సమ్మోహనాస్త్రంబు
గాండివమునఁబూని దండిఁనేయ
శౌరియొకఁడు దక్క శార్ఙ్గదళము లెల్ల
మూర్ఛచెందిపడియె భూమియందు. 192

క. నరుచేతి విల్లుబాణము
మురహరుఁడొక శరముచేత ముత్తునియలుగా
ధరఁబడ నేసినఁ బార్థుఁడు
మఱియొకవింటనుశరంబు మాధవు నేసెన్. 193

క. మురహరుఁ డప్పుడు శార్ఙ్గము
సరగున నెక్కించి భీమసాయకములచే
నరుసురము గాడ నేసినఁ
బొరిపొరిగాఁ జేసెవాని భూరిశరములన్. 194

ఆ. సవ్యసాచియేచి సక్రోధచిత్తుఁడై
కంసవైరిమేన ఘనశరముల
నాటనేయవాని నలినలిగాఁజేసె
గోపికావిభుండు కోపమునను. 195

సీ. హరియంధకారాస్త్ర మర్జునునిపై నేసె
నతఁడేసె సూర్యదైవతశరంబు
చక్రాయుధుండేసె సర్పబాణంబును
గవ్వడివైచెను గరుడశరముఁ
బర్వతభల్లంబు పద్మాక్షుఁ డేసెను
గులిశాయుధంబేసె గుంతికొడుకు

వహ్నిమార్గణ మేసె వసుదేవసూనుండు
వరుణాశుగం బేసె నరుఁడు మఱియు
ఆ. మేఘబాణ మపుడు మేఘవర్ణుం డేసె
ననిలబాణ మేసె నర్జునుండు
శౌరియు సురరాజ చక్రంబు నేసిన
విశిఖమునను దునిమె వేగమునను. 196

తే. చక్రహస్తుఁడు భీకర శక్తిఁబూని
సురలు భీతిల్ల వాసవ సుతుని మీఁద
వైవ నాతఁ డుగ్రుండయి వాడిచండ
కాండములదానిఁ దునుకలు గాఁగ నేసె. 197

మ. బలభద్రానుజుఁ డప్డు డాగ్రహమునన్ బ్రహ్మాస్త్రముస్ వై
చినన్, బలభిత్సూనుఁడు దానినేయనవియుం బైపైని
బోరాడఁగాఁ, గలగంబాతెను వార్ధులున్వసుధయున్ గం
పించె నక్షత్రముల్, ఇలపై రాలెను మార్గము ల్దొలగిరా
యేణాంక మార్తాండులున్. 198

వ. అప్పుడు. 199

ఆ. ఏపుమీఱి యీతఁ డెనురాని యున్నాఁడు
దర్పమణఁచి వైతు ధరణిననుచుఁ
జేరి కృష్ణుఁ డపుడు నారాయణాస్త్రంబు
వింటనమర నునిచి విజయుఁ జూచి. 200

సీ. పాశుపతానేక భాసురాస్త్రంబులు
త్రిపురారి చేతను దెచ్చినావు
దిక్పాలకులు నీకు దివ్యబాణంబుల
నిచ్చిరి మెండుగా నెలమితోడఁ

గదనంబు సేయఁగఁ గడుసమర్థుండవు
ప్రతిలేనివిక్రమ పరుఁడవీవు
నీధైర్యమహిమంబు నీశౌర్యమహిమంబు
నీయస్త్రనిపుణత నేఁడుగోరి
తే. దనరనియ్యాను దీనికిఁ దలఁగవేని
నీదు పౌరుషమణఁగును నిజముదీన
ననుచు వైష్ణవసాయక మాక్షణంబె
వెన్నుఁడేసెను క్రోధియై విజయుమీఁద. 201

వ. ఆసమయంబున. 202

సీ. మార్తాండచంద్రులు మార్గముల్ దప్పిరి
ఫక్కునబగిలెను దిక్కులెల్లఁ
దల్లడంబందెను ధాత్రీతలంబెల్ల
గోత్రబృందంబులు కుదురుదప్పె
విస్మయంబందెను విబుధసమూహంబు
శేషాహిభయముచే శిరమువంచె
పాథోధులన్నియుఁ బరగంగనింకెను
దారకావ్రాతంబు ధరణిడుల్లె
తే. శరశిఖామణి వైష్ణవసాయకంబు
దివ్యకాంతులచేతను దేజరిల్లి
వచ్చు నారాయణాస్త్రంబు వరుసఁజూచి
భయముఁ జెందకనిల్చెను ఫల్గుణుండు. 203

వ. ఆసమయంబున. 204

ఆ. పాండునందనుండు బ్రహ్మశిరోనామ
కంబు నమరఁజేర్చి గాండివమున
మంత్రముచ్చరించి మదినిచేఁబూనియు
మదనదర్పహరుని మదిఁదలంచి. 205

సీ. శమనతనూజుని సత్యంబు నిజమేని
ధర్మమేయెడలను దప్పనేని
కుంతీమహాదేవి గురుపతివ్రతయేని
యామ్నాయసమితి తథ్యంబయేని
ఈమహాశరమున కెదురగుచునుజనుఁ
గాక యనుచునేసె ఘనతమీఱ
నినకోటితేజమై యెలమితోఁడుతవచ్చు
పరమాత్మబాణంబు పైనిగవిసి
తే. బెనఁగె నస్త్రద్వయంబును బెల్లుగాను
గెలుపు నోటములును లేక చెలఁగిచెలఁగి
దంతిదంతియు హరిహరి దాఁకినట్లు
చక్రినరుశరములుబోరె సమరమునను. 206

వ. తదనంతరం బాహృషీకేశుండు గుడాకేశున కిట్లనియె.

తే. భళిర! మేల్మేలుఘనుఁడవు ప్రధనమునను
శస్త్రకుశలత్వమునకును జాణవేను
తలఁచు నీకిష్టదైవంబు తనరుననుచు
రాక్షసాంతకుఁ డుగ్రుఁడై రమణఁబలికె. 208

ఉ. నాకముఁజొచ్చినం ద్రిదశనాథుఁ డతండునువచ్చి కాచినన్
భీకరమూర్తియాశివుఁడు పెక్కువిధంబుల నిన్నుఁ బ్రోచినన్

దేశువనాగలోకమున దిన్నగ నాబలిచెంతనుండినం
బ్రాటమైనచక్రమునఁ బ్రాణములం బోరిపుత్తు నర్జునా! 209

తే. చక్రధారకుఁ బ్రాణముల్ సరవితోడ
నిచ్చెదో గయునిచ్చెదో యిప్పుడనుచుఁ
బ్రళయమార్తాండబింబంబు పగిదినొప్పు
చారుచక్రంబుఁ జేబూనెఁ జక్రధరుఁడు. 210

వ. ఆసమయంబున. 211

ఆ. మూఁడుకన్నులయ్య ముదముతోనిచ్చిన
ప్రళయకాలభూరిభయదవహ్ని
చటులకాంతిజాల సంయుక్తమగునట్టి
పాశుపతముఁబూనె ఫల్గుణుండు. 212

వ. ఆసమయంబున సదాశివుండు దయారసభరితుండై యమ్మ
హానుభావులకదనంబునివారింపం దలంచి జగత్ప్రాణాపహ
రణాగ్రవేయుండును, కైలాసకూటధాముండును, వ్యాఘ్ర
చర్మచీనాంబరావృతుండును, బద్మమిత్రరాకేందువహ్ని
నేత్రుండును, జారుభసితసాంద్రలిప్తగాత్రుండును, భాసుర
రాకేందుసమానపంచవదనుండును, దపనీయనిర్మలారుణ
జటామకుటుండు నై చనుదెంచి యానరనారాయణుల
నడుమనిలిచి పుండరీకాక్షుముఖారవిందంబు వీక్షించి యి
ట్లనియె. 213

ఆ. కోపమేలనయ్య గోపాలవల్లభ!
ప్రాణసఖుఁడు నీకు ఫల్గుణుండు

నీవు పెంచినావు నిగ్రహింపఁగరాదు
సాహసంబువలదు చలమువిడువు. 214.
ఆ. కలిగె నొకతెనీకు గారాబుచెల్లెలు
మనసుభద్రచాల మదినిఁగుందుఁ
గాన మేలులేదు కవ్వడినొచ్చిన
నీకుఁ దెలియనట్టి నీతిగలదె? 215.
సీ. అఖిలలోకాధీశ యంభోజదళనేత్ర
బ్రహ్మేంద్రవందిత పరమపురుష
భువనముల్పుట్టింప ముదముతో రక్షింప
నణఁగింపఁజాలుదు వనఘచరిత
నీమాయదెలియంగ నేర రెవ్వారును
భావింపఁగాఁ బరబ్రహ్మమీవు
భూభారమణఁగింపఁ బుట్టినా రిలలోన
నిరువురీ మీరిట్టు లెలమితోడ
తే. నీవు నే ననుభేదంబు నెన్న లేదు
సమము మనకెంచిచూడఁగ సవ్యసాచి
యతని విక్రమప్రతినల కలరిమనము
మెచ్చుకుండుట ధర్మమే మేఘవర్ణ. 216
వ. అని యనేకవిధంబుల వృషభధ్వజుండు గరుడధ్వజునకు మనోహరంబుగాఁ దెలియంజెప్పి తన భక్తుండైన కపిధ్వజు నత్యాదరంబున చేరంబిలిచిన నతిభక్తితో నిఖిలామ రేంద్రాదిలసన్మస్తభాస్వత్కిరీటసంఘటితరత్నకాంతిశోభిత పాదారవిందోపరిస్థిత మస్తకుండై లేచి కరకమలంబులు మొగిడ్చి యి ట్లనియె. 217

సీ. జయపార్వతీనాథ జయ మేరుకోదండ
జయసుజనాహ్లాద సదయహృదయ
జయసంతతోల్లాస జయవృషభధ్వజ
జయరవిశశినేత్ర చంద్రమౌళి
జయకరుణానిధీ జయసత్యసంచార
జయసురశేఖర సత్యనిత్య
జయనాగకేయూర జయభస్మలిప్తాంగ
జయదివ్యచారిత్ర శౌరిసఖ్య
తే. భక్తకల్మషసంహార పరమపురుష
నిన్ను వర్ణింపశక్యమే నిగమవేద్య
యనుచు వినుతింప విజయు నత్యాదరమున
కనుఁగొనుచుఁబల్కె నీశుఁడు గౌరవమున. 218

క. వారిజనాభుఁడు మేమును
శూరుఁడవని మెచ్చినాముఁ సురపతితనయా
కోరిన వరమడుగుమనఁగ
గౌరీవల్లభునకనియె కవ్వడినతుఁడై. 219

తే. పెక్కువరముల నేనొల్ల భీతుఁడైన
గయునిగాఁచుటవరమింతె గరళకంఠ!
యనిన సూనాస్త్రసంహారి హర్షమునను
హరికి శరణంబుచొరుమన్న నర్జునుండు. 220

ఆ. అమరరాజతనయుఁ డమ్ములపొదిలోన
దాఁచియున్న గయుని దక్షణంబ
వెడలి దిగిచితెచ్చి వేవేగమ్రొక్కించె
శౌరిపాదములకు సమ్మదమున. 221

తే. గయుని ప్రాణంబులనుగావు కమలనాథ!
యింతకన్నను వరమొల్ల నిదియెచాలు
ననిన రాధామనోహరుం డభవుఁ డనుపఁ
బార్థువీక్షించి సంతోషభరితుఁ డగుచు. 222

సీ. రుక్మిణీకుచముల రుజువుగాఁజెక్కిళ్ల
ముదముతోఁ గస్తూరి బూసినట్టి
సత్యభామకురులు సముదంబుగా దువ్వి
సూనముల్ జడనిండఁ జుట్టినట్టి
రాధాశిరోమణీ రాకేందుముఖమునఁ
దిన్నగాఁ దిలకంబుఁ దీర్చినట్టి
మిత్రవిందాదేవి మేన నిండారఁగాఁ
జెలరేఁగి మలయజం బలఁదినట్టి

తే. విమలకరమును గంధర్వ విభునిపారి
జాతకుసుమవాసనలచేఁ జాలనొప్పు
శిరముపైనుంచి మదనారి సురలుమెచ్చ
"నమ్ము గయ! నిన్ను గాచితి నరునిఁజూచి." 223

ఆ. "తొల్లియట్లె నీవు దోర్బలశక్తిచే
నెల్లసురలుమెచ్చ నెలమితోడ
ఘనుఁడవై మెలంగు గంధర్వసమితితోఁ
జాలకాలముండు లీలగాఁగ." 224

క. అని కృష్ణుఁ డభయమిచ్చిన
మనమున సంతోషమంది మాధవుపదముల్
దనకనులనద్దుకొనుచుఁ
ఘనమతి నాగయుఁడు లేచెఁ గలకల నగుచున్. 252

క. అప్పుడు పువ్వులవానలు
తెప్పలుగాఁ గురియమింట దివిజేంద్రాదుల్
మెప్పుగ మ్రోసెను దుందుభు
లప్పార్థుని సత్యమనుచు నతిమోదమునన్. 226

తే. చిత్తజారాతిసంతోష చిత్తుఁ డగుచు
నింద్రనందనుఁ గనుఁగొని యింకనీవు
వర మొకటికోరు మన్న నఁ హరునిపాద
జలరుహంబులకును మ్రొక్కి పలికెనపుడు. 227

క. గిరితనయా వల్లభ! మీ
వరమునకుఁ దగినఘనుఁడు పాండుసుతాగ్రే
సరుఁ డున్న వాఁడు కోరఁగ
నిరుపమకరుణాసముద్ర! నిర్మలగాత్రా! 228

చ. హిమగిరికన్యకారమణుఁ డిందుకళాధరుఁ డార్తపోషకుం
డమరహిరణ్యగర్భనుతుఁ డంగజదర్పహరుండు పావనుం
డమితకృపాసముద్రుఁడుకృతాంతకుమారునిఁజూడనప్పుడా
శమనతనూభవుండుమదిసంతసమందుచుమ్రొక్కెభక్తితోన్.

చ. శరణుమహేశ యీశ భవ సారసవైరికిరీటశేఖరా,
సురగిరిచాప విష్ణుశర సూనశరారి లసద్వియన్నదీ, ధరని
గమాంతవేద్య హర దైత్యమదేభ మృగేంద్రరూపమో
పరమకృపానిధీ విలయ భాస్కరరాజకృశానులోచనా.230

వ. అని యనేకప్రకారంబులు స్తుతియించిన గంగాధరుండు
ప్రమోదస్వాంతుఁడై పాండుకుమారాగ్రణి కధికమోదం
బున ని ట్లనియె. 231

మ. సమవర్త్యాత్మజ! నీదుధర్మమునకుఁ సంతోషముంబొంది నే
నమరానీకము మెచ్చఁగా నొకవరం బర్హంబుగానిచ్చెదన్
హిమధామాన్వయవార్ధి రాజ వినుమాయిష్టంబునీకేమనన్
సమరక్షోణిని నీల్గినట్టినరులన్ సప్రాణులంజేయవే! 232

ఆ. ఇంతకన్న వరము లేనొల్లమిక్కిలి
యవనిఁగూలినట్టి యఖిలబలము
బ్రతుకఁజూడరయ్య పద్మాక్షశంకర
యనిన నుభయబలము లాక్షణంబె. 233

తే. నిద్రమేల్కొన్నవిధమున నిఖిలభటులు
వచ్చినిల్వఁగ తమతమ వాహనములఁ
జూచి ధర్మతనూజుండు చోద్యమంది
నీరజాక్షుఁడౌ హరిచెంత నిలిచియుండె. 234

వ. అప్పుడు. 235

ఆ. జంభభేదిసుతుఁడు జలజాక్షు శ్రీపాద
పద్మములకు నెంతొ భక్తితోడ
సాగిమ్రొక్కియప్డె సరవితోడుత లేచి
సన్నుతించె మిగుల సరసముగను. 236

సీ. అచలాంబుజాత వేదానలగగనముల్
తరణినిశాకర తారకములు
గోత్రంబు దిక్కులు గోధ్వజపరమేష్ఠి
పాకశాసన మరుత్పాదపములు
జలనిధుల్ నదులును సకలలోకంబులు
పవనగుల్ వేదాళిశాస్త్రములును

పక్షులు మృగములు పంచలోహంబులు
మణులు నాయుధములు మానవులును
తే. సత్యమును నీవె క్షరుఁడవు శాశ్వతుఁడవు
నిర్గుణుండవు గుణివీవు నిర్మలుండ
వాదినారాయణుఁడ వీవ యనఘచరిత
నీమహిమలు గనవశమె నీరజాక్ష! 237

క. నీతోఁ బోరఁగ శక్యమె
భూతలమున నెవరికైనఁ బురహరుకైనన్
శ్రీతరణి చంద్రలోచన!
శ్రీతరుణీనాథ కృష్ణ శ్రితజనపోషా. 238

వ. నీ వాదినారాయణుండవని యెఱుంగక యాదవుండవని, మేనబావ వని మేలంబున నవ్వుచుఁ బ్రేలుచుఁ బొత్తున భుజియించెద. 239

క. నా నేరము మదినుంచక
దానవగంధేభసింహ దయతో గయునిం
బ్రాణములఁగాఁచి బ్రోచితి
శ్రీనాథా! యేలవయ్య చిత్తజజనకా. 240

క. తనయులు చేసిన తప్పులు
మనమునఁ దలపంగఁబోరు మఱితలిదండ్రుల్
నను నీవట్లుగఁ బ్రోవుము
కనకాంబరధారభక్త కలుషవిదూరా. 241

వ. అని మఱియును సవినయంబుగా హరిసమీపంబునకువచ్చి యిట్లని స్తుతించె. 242

దండకము:—శ్రీరుక్మిణీలోల యోసూర్యచంద్రాక్ష యక్షీణ దక్షా సహస్రాక్షరక్షా జగద్రక్షకా దైత్య నాగేంద్రహా ర్యక్ష నాగాంతకాధీశ సత్కేతనా యీశ సఖ్యామరశ్రేష్ఠ యాకాశ జాహార రాజన్యశయ్యా చిదానంద తారాద్రి నీహార శతాద్రి తారేశ హార్యక్ష శంఖాహి రాజన్య సత్కీర్తి సాంద్రా చతుర్వక్త్రముఖ్యార్చితా నీలధారాధర చ్ఛాయగాత్రా నిరాకార సాకార యీశా ఘనశ్రీసదా నందచిత్తా యచింత్యాక్షరానేకఖద్యోతతేజా జయాశార్జ్గ రాజాన్యహృన్మార సేందిందిరా చక్రి నందాంగనా నందనా యోత్రయీచోరహంతా స్తికాధార పీరా జితానేక ఘోరాస్త్ర దైతేయ రాజన్య నిర్ఘాత లంకేశ కాఠిన్య సంతాపహారి హరీ శ్రీవధూసక్తచిత్తా స్వభక్తప్రజాధీన నీసత్కథల్ విన్నగా నెన్న సుజ్ఞానినిం జేయచుం గృష్ణ రక్షింపు నాథా నమస్తే నమస్తే నమః. 243

వ. అని యనేక ప్రకారంబుల స్తుతించిన పురందరనందనుం గనుంగొని మందస్మితసుందరవదనారవిందుం డగుచు ముకుందుం డతు కౌఁగిటం జేర్చి యి ట్లనియె. 244

క. పురుహూతాత్మజ! మీఁదను
గురుపతికిని మీకుఁగల్గు కుంభినికొఱకై
ఉరుతరరణంబు దానిం
దరమఁ మాన్పంగ నలవిధాతకునైనన్. 245

ఆ. గట్టివాఁడవగుటఁ గార్ముకనిపుణత
గలుగుట శరవిద్య ఘనుఁడ వగుట
ధైర్యశాలి వగుట శౌర్యధురీణుఁడ
వగుట నేనెఱుంగ నయ్యనిన్ను. 246

ఆ. ఇపుడు చూడవలసి యీపని చేసితి
ననిన నింద్రసూతి హర్షమునను
శౌరిపాదములకు సాగిలి ప్రణమిల్లఁ
గ్రుచ్చి కౌఁగిలించెఁ గూర్మితోడ. 247

క. అప్పు డటు చేయఁ గన్నులఁ
దప్పక హరిహయుఁడు చూచి తనడింభకునిన్
ముప్పిరిగొను హర్షంబున
నొప్పుగ దీవించి దివికి నొయ్యనఁ జనియెన్. 248

తే. పార్థునివర ప్రతిజ్ఞకుఁ బద్మభవుఁడు
వేయివిధముల వినుతించి వేడ్కతోడ
నరిగె యాసత్యలోకము నఖిలమునులు
గొలిచియుండఁగ భారతిఁ గూడియుండె. 249

వ. తదనంతరంబ సదాశివుం డానందచిత్తుండై యావసుదేవ
నందనుం గనుంగొని. 250

చ. కమలదళాక్ష దైత్యకుల ఖండన నీలపయోదవిగ్రహా
యమితకృపాబ్ధి నీరజభవార్చితపాదపయోజ శేషశా
యిమధువిరోధి కేశవసురేంద్ర సహోదరశార్ఙ్గిమాధవా
విమలగుణాభిరామహరి విశ్వమయుండవు నీవెయెన్నఁగన్.

ఆ. ప్రాణసఖుఁడు మీకుఁ బాకారిసూనుండు
భక్తవరుఁడు మీకుఁ బద్మనేత్ర
యితఁడు మనలనమ్మి యెలమితో నున్నాఁడు
కరుణదప్పకుండు కమలనాభ. 252

వ. అని సదాశివుండు సంక్రందన నందన యదునందనులకు
భేదంబు లేకుండుటం దెలియఁజెప్పి తదనంతరంబ. 253

ఆ. ప్రమథగణముగొల్వ పార్వతీ సతితోడఁ
జనియె రజతగిరికి శంకరుండు
పాండునందనులను బాంచాలపుత్రిని
నాదరించె ప్రేమ నచ్యుతుండు. 254

వ. మఱియు ధర్మనందనునకు వసుదేవనందనుం డనాగత
వర్తమానంబులు గొన్ని రహస్యంబులు దాఁజెప్పి మీకు
శుభంబుగల్గుఁ బగతురంజయింతురని యానతిచ్చి యాదవ
సేనాసమేతుండై బలభద్రసాత్యకీప్రద్యుమ్నపుష్కరు
లతో ద్వారకాపురంబుఁ బ్రవేశించి యుండె నంత. 255

క. ధీరుఁడు శమనతనూజుఁడు
రారాజును గురుని భీష్మ రవిజులనెల్లన్
గూరిమితోడుత ననిపిన
వారును వేవేగచనిరి వారణపురికిన్. 256

తే. పరగఁగ ఘటోత్కచుండును బాండవులకు
మ్రొక్కిచనుమన్న భీముని ముద్దుసుతుఁడు
దైత్యవీరులు పెక్కండ్రు దవిలిరాఁగఁ
జనియెఁ దన నెలవున కతిసంభ్రమమున. 257

వ. అప్పుడు. 258

సీ. పార్థుపాదములకు భక్తితో నమ్రుఁడై
ప్రణతులు సేయుచు బరఁగ గయుఁడు
ఓ రాజశేఖర యోసత్యసంచార
జంభారి సత్పుత్ర శార్ఙ్గిమిత్ర
దనుజారితోఁ బోర దనూరికి నిశక్య
మేయింత సాహస మీధరిత్రి
నాప్రాణములుగాఁచి నన్ను రక్షించితి
వర్ణవగంభీర యచలధీర !
తే. అనుచు వినుతింప ముదమంది యర్జునుండు
నగుచుఁ గౌఁగిట జేర్చి గంధర్వవిభుని
నెల్లవిధముల విహరింపు మిలను నీవు
భయము లేకుండ నని పంచె బార్థుఁ డపుడు. 259

తే. పసిడి తేరెక్కి సంతోషభరితుఁ డగుచు
మణిపురంబునకుం జని మగువ సుతులు
తల్లిదండ్రులనుం గూడి తొల్లియట్లు
ఘనుడు గంధర్వపతియుండె గౌతుకమున. 260

తే. యమతనూజుండు సంతోష మావహిల్ల
ద్వైతవనమునఁ దమ్ములు దానుద్రుపద
పుత్రితోడను సంపదల్ పొందియుండెఁ
జేరి ధౌమ్యాదులెల్ల నాశీర్వదింప. 261

సీ. ఈకథవ్రాసిన నెల్లవారికిఁగల్గు
నాయురారోగ్య పుత్రాభివృద్ధి
ఈకథ పఠియించు నెట్టివారికినైనఁ
గరితురగాదులు గల్గుజయము
విమలహర్షణములు కమనీయసౌభాగ్య
శ్వేతాతపత్రముల్ చెలఁగుచుండు
నింపొందు పదవులు నిందీవరాక్షులు
నెల్లవస్తువ్రాత మెలమితోడ

ఆ. జలజనేత్రుఁ డధిక జయము సంతతముసు
బరఁగఁదనదు సతికి పట్టుచేసి
యిష్టసిద్ధులొసఁగి యెలమితోరక్షించు
ననుచుఁజెప్పె మునిగణాధిపుండు. 262

క. విలసితసురమునివందిత
కులగిరిసమధైర్యదైత్య కోటివిరామా!
సలలితభవవినుతయహో
బళగిరివరమందిరేశ పావనచరితా. 263

తోటకవృత్తము. కమలాయతలోచన కంసహరా!
సమరాహతదానవ చక్రధరా!
విమలాంబుజలోచన విశ్వపతీ!
సుమహానరసింహా విశుద్ధమతీ! 264

మాలినివృత్తము. సరసిజదళనేత్రా సామజస్తోత్రపాత్రా
నిరుపమహరమిత్రా నీరదాకారగాత్రా
వరగరుడగిరీశా వారిజాప్తప్రకాశా
సురరిపుమదనాశా సూరిచిత్తాబ్జవాసా. 265

గద్య. ఇది శ్రీమదహోబలేశ్వర కరుణాకటాక్షవీక్షణ ప్రవర్ధమానకవితావైభవ తిమ్మనమంత్రితనూభవ రామనామాత్య ప్రణీతం బైన శ్రీకృష్ణార్జునసంవాదం బనునామాంతరంబు గల గయోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.

చెన్నపురి: శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1934—800.